

# సూచన

లోకంలో యెంతెంతో మర్యాదస్తులుగా పైకి కనుపిస్తూ— లోలోపల దారుణకృత్యాలు—సాగించేవారున్నారనీ — ప్రతిమానవునకు మంచిలోగాని—చెడ్డలోగాని — రోజులొక్క రీతిగా జరగవనీ — నాలుగు డబ్బులు చేతిలోకి చేరినప్పుడిదంతా నాప్రయోజకత్వమే అనుకోగూడదనీ—ఆనాలుగురాళ్ళూ చేతిలోంచి యెగిరిపోవడంతోనే నాకర్మయిల్లా వుందనీ, నాప్రారబ్ధమిట్లా అయ్యిందని అనుకోడం పొరపాటనీ—పాఠకులకు విశదంచెయ్యడమే—ఇందులోని ప్రధానాశయమని—గ్రహించండి.

ఇంక ఛాంపియన్ అనే మాట కనబడడంతోనే యీయన ఎందులో ఛాంపియన్ అని ఖంగారు పడకండి— చివరకంటా చదివితే— తెలుస్తుంది ... ...

రచయిత.



౧

'అబ్బాయీ! ఇహా యింతేనా నీపరిస్థితి?'

'ఏంచెయ్యమన్నారు? ఎన్నిప్రయత్నాలు చెయ్యాలో అన్నీ చేసాను'

'నువ్వుచేసిన ప్రయత్నాలేవిటి నీమొహం'

'ఇంట్లోకూచున్న మీకేం తెలుస్తుంది నేచేసిన ప్రయత్నం'

'తెలియకేం—అంతా తెలుసు—పొద్దున్నే లేవడం — కాఫీహోటలు కెళ్ళడం—భోజనంవేళకి సిద్ధంకావడం—షికార్లు—అవకాశందొరికితే యింట్లో ఏమైనాచెక్కెయ్యడం—ఇంతేగా'

'రామరామా!— ఇదేంకర్మమోగాని మీనోటంట యెటువంటి మాటలొస్తున్నాయండి నాన్నగారూ'

'నీకర్మంగాదు—నాకర్మమే—నీకేం హాయిగాతింటున్నావు—తిరుగుతున్నావు—నిందాబందా'

'నాలుగుడబ్బులు సంపాదించలేకపోయానుగదా అని నేనెంత ఫీలవుతున్నానో మీకెలా తెలుస్తుంది'

'నీవు సంపాదించడం ఈజన్మకిలేదు—నేబ్రతికుండగా అలాంటిదుండదు'

'రోజులెప్పుడూ—ఇలాగేవుంటాయా?'

'ఇంతకన్న ఎక్కువగా తగలబడతాయా నీజన్మకి—సిగ్గులేక నేనమ్మా వెధవ బి. ఏ. పట్టా తెచ్చాననీ—అభిమానగర్వాలతో ఏడిస్తున్నావు. నీబ్రతుకంతే'

'అలానే ఆశీర్వదించండి—ఏంచెయ్యను'

'ఏంచేస్తావు - నాప్రాణంకాస్తా గుటుక్కుమనడంతోటే — ఈ దొప్పెడుపొలం కాజేసి—నవతమ్మనోట్లో దుమ్ముగొట్టి—ఆబాణ — నువ్వూ—చిలకాగోరింకల్లా—మిట్టిపడతారు'

'అలాంటిదేమీ నాకెప్పుడూ పుట్టలేదు—ఇకముందుపుట్టదు—నాశరీరంలో ప్రాణముండగా నాసవతిగల్లికి మాయిద్దరివల్లా ఎటువంటి హానీజరగదు'

'ఇవన్నీ నాకు తెలుసు—పయోముఖవిషకుంభాలు—గోముఖ వ్యాఘ్రాలు'

'మీకంత అనుమానం నామీదవుంటే — అదంతా పిన్నీపేర వ్రాయండి—మాఅభ్యంతరం ఏమీలేదు'

'అభ్యంతరం చెప్పడానికినీకేం అధికారముంది. నాస్వార్జితం'

'అధికారముందని నేననడంలేదు. మీదుమిక్కిలి మనఃపూర్వకంగా సంతోషం వెలిబుచ్చుతున్నాను'

'అయ్యో—దానికేంతోషం —2 గంటలదాకా చదివిచదివి నానాకష్టాలుపడి—యీకుటుంబభారం—నేమోయలేను'

'కుటుంబభారానికల్లా ఎవరున్నారు?'

'ఎంతమందికావాలి—మీరిద్దరూచాలరు—నాప్రాణానికి'

'మాయిద్దరిబరువూ మీకు భారంగావుంటే పోతాములెండి—మీరుమాత్రం మానిమిత్తం నానాకష్టాలూపడొద్దు'

'మీనిమిత్తంగాకపోతే నాకేముంది—ఇద్దరం—పోలేదు. ఉడికించుకున్నామంటే—ఇల్లంతాకూడే'

'అయితే మీరు మాకుష్పష్టిగాచెప్పక స్పష్టంగాచెప్పండి'

'స్పష్టంగానేచెవుతున్నాను—20 ఏళ్ళు ఒచ్చేదాకా పెంచాను—బి. ఏ. ప్యాసయ్యేవరకు బోలెడంతఖర్చుపెట్టి—చదువుచెప్పించాను—పెళ్ళిచేసాను—పదాదినుంచీ యిద్దరికీ కూడెడుతున్నాను—ఇక నేంచెయ్యగలను. ఇక నావల్లగాదు—మీరతంటాలు మీరుపడండి'

'ఈమాటచెప్పటాని కింతడొంక తిరుగుడెందుకండీ'

'డొంక తిరుగుడేముందీ—చూశాను—ఏడాదినుంచీ— కానివంపా దన లేదాయె'

' నిజమే — నాదురదృష్టంవల్ల ఏఉద్యోగమూ దొరకలేదు. కాయకష్టులా తంటాలుపడ్డాను—పడుతున్నాను '

' నువ్వేంతంటాలుపడ్డా నాకక్కరలేదు. నేనింక మేపలేను. '

' మీరింక నేమీ చెప్పనక్కరలేదు. మీమనస్సులోని భావం నాకు గ్రహింపయింది. '

' నువ్వు గొప్పవిద్వాంసుడవు—బి య్యేవి—నీకర్థం గాకపోవడ మేమిటి? '

నాకాగర్వం ఎప్పుడూ లేదు—మీమాటకెప్పుడూ ఎదురాడలేదు'

' నీకుందోలేదో—ఆజాణ — ఇరుగుపొరుగమ్మలక్కలతో—మా ఆయన బి. ఏ. మాకేమండి. ఎక్కడకుపోయినా ఉద్యోగం దొరుకు తుంది—అని బాజాలు వాయిస్తుంది. '

' దానిముహం—దానికేందెలుసు—ఇప్పటి బి. ఏ. ల అవస్థలు '

' ఇహా తెలుస్తుంది. '

' నేను జన్మించినదాది నాకు మీరుచేసిన మహోపకారాలకి నేను మీకు ఋణపడేఉన్నాను. ఏవిధంగానూ కృతజ్ఞత చూపలేక పోయాను. క్షమించండి '

' ఈచోల్లాయికబుర్లకేమిటి '

' అంతేలెండి—ఇప్పుడు నాదొకప్రార్థనుంది '

' ఏమిటేమిటది '

' నేను రేపే కట్టుబట్టలతో— ఇంట్లోనుంచి — మీఆజ్ఞప్రకారం వెళ్ళిపోతాను. కాని—'

' నేను అంటున్నావేమిటి—ఆజాణ నిక్కడేవుంచుతావా ఏమిటో

కాని—అంటూ హంసపాదు పెట్టావేవిటి? '

' నేను— కాదు— అది పొరపాటు లెండి. మీరు చెప్పుకునే దేమంటే— ప్రియాణపుఖర్చులకేనా ఏదేనా కొంతయివ్వండని '

' నాదగ్గిరేముంది? ఎట్టి నేగాణిలేదు నన్నేమీ అడగద్దు'

అని ఆతండ్రీకొడుకులు మాట్లాడుకుంటూంటే ప్రకాశరావుసవతి తల్లక్కడకొచ్చి— భోజనానికి లేవండని పిలిచి అక్కడే నిలబడింది. శరభయ్యగారు కళ్ళు చారెడుచేసికొని రెండోభార్య కేసిచూసి- వస్తానువెళ్ళు అన్నాడు. ఆమె కదల్లేదుసరిగదా- మీరిద్దరూ ఏవోరహస్యాలు మాటాడుకుంటున్నారుకాబోలు పోతాలెండి—

అంటూ కాలుకదపకుండాసే- అందుకనేకాబోలు కోడలు తలుపు చాటునక్కి- వింటోంది- నాకెందుకూ అని కదలబోయింది.

అంతలో ప్రకాశరావు రహస్యంకాదుపిన్నీ బట్టబయలే- నాన్నగారు మమ్మన్నిద్దర్నీ తిండిపెట్టలేను మీతోవమీరు చూసుకోండని చెబుతున్నారు- మేము రేపే బయలుదేరి పోతున్నాం. దారిఖర్చుల కేమన్నా యిమ్మని అడుగుతున్నానంతే—

' ఏమన్నారండీ మీరు '

' నాదగ్గిరేముంది ఇవ్వడానికి '

' ఔను బియ్యపుషావుకారూ—బట్టలవాడూ — కిరాణాకొట్టువాడూ—అంతా వీకేస్తున్నారు. బాకీలకి—చేతులో చిల్లిగవ్వ లేనట్టుగా వుంది—అంది.

దాంతో ప్రకాశరావు మొహం వెలవెలపోయింది. శరభయ్యగారు భోజనానికివెళ్ళారు. కొడుకును పిలువలేదు. ఇహానాయింట్లో తనకి అన్నప్రాప్తి లేదని నిశ్చయించుకుని — తనభార్య రాజేశ్వరి ఉన్నగదిలోకి వెళ్ళాడు.

రాజేశ్వరి ప్రకాశం ఇంట్లోకి వెళ్ళేసరికి ఎందుకో పెట్టె తెరచి సర్దుకోతూంది. భర్త వణుకుతూన్న శరీరంతో మంచంమీద వాలాడు. అతని మొహంలో కనబడేనిస్పృహ—నిరాశ—ఆమెకళ్ళకు కట్టినట్టయింది. వెంటనే భర్తను సమీపించి—

'అలా ఉన్నారేమండీ?' అంది

'ఎల్లాగాలేనుగాని—నీతో రెండుమాటలు చెప్పాలి కూర్చో.

'నిలబడతాలెండి—కానియ్యండి — మీ తండ్రీకొడుకుల సంభాషణంతా విన్నాను. ఇప్పుడు మీరనేదేమిటి?'

'ఇహాఘనం ఈయింట్లో రేపు సూర్యోదయం చూడవల్లకాదు

'అయితే ఏంచేద్దాం'

'నామనోనిశ్చయం చెపుతున్నాను— అడ్డదిడ్డాలు చెప్పక—దూరంగా ఆలోచించుకొని—నడవాలి.'

'చెప్పండి.'

'నేను ఎక్కడికో ఒకచోటకెళ్ళి ఉద్యోగం దొరికేదాకా ఇంటికి రాను. అంతవరకూ నువ్వు పుట్టింటి కెళ్ళిపోయివుండు—ఉద్యోగం అయినవెంటనే వచ్చి తీసుకెడతాను.

'మీరింకేదైనా చెపితేచేస్తానుగాని ఇదిచెయ్యలేను.'

'లేకపోతే వీల్లేదు.'

'ఏంచేత'

'నేనెక్కడెక్కడ ఎల్లా తిరగవలసివస్తుందో-నావెంట నువ్వుంటే అనేకచిక్కులు.'

'మీరిక్కడా అక్కడా చిక్కులుపడుతూ—వస్తులుపడుకుంటూ ఉంటే నేను పుట్టింట హాయిగావుండరా?'

'తప్పకొచ్చినప్పుడేంజేస్తావు'

'నేనూ మీ వెంటవస్తాను. మీరు దారిఖర్చులకు చిక్కుపడకండి. నాదగ్గిర రొక్కమేమీ లేదు—కాని మావాళ్ళెట్టిన విలువైన పతకాలు నాలుగున్నాయి—అవిగడి విప్పలేదు—ఎంతలేదన్నా రెండువందలొస్తాయి—బజారులోకి తీసుకెళ్ళి అమ్మెయ్యండి.'

'నీబట్టలు—నీపుట్టింటివారు పెట్టినవమ్మేనా?'

'వేరుమార్గంలేదుగా'

'ఎక్కడో ముష్టెత్తి పదిరూపాయలు తెస్తాను. నిన్ను పుట్టింట దిగబెట్టి—దాంతో నేను వెళ్ళదలచిన ఊరుచేర్తాను.'

'మిమ్మల్ని వదిలి నేనుండలేను.'

'నేనుండగలనా? కాని దైవావ్యతిరేకంగా వున్నప్పుడేంచేస్తాం'

'మీ వెంట నేనుంటే ఏదో సేవచేస్తాను.'

'చేస్తావు—నీసేవలందడానికి తీరుబాటుందా — కాళ్ళరిగిపోయేటట్లా తిరగాలి.'

'తిరిగి తిరిగి యింటికొచ్చేసరికి చల్లనినీళ్లు దాహమిస్తాను.'

'ఇల్లనేదేది మనకి—నువ్వు పెంకిపట్టుబట్టకు—పెట్టెసర్దిప్పుడే.'

'ఏమేమిసర్దమన్నారు'

'నీతాలూకు బట్టలు నీపెట్టెలో వేసుకో—మిగిలిపోగా మిగిలివున్న నాసూళ్లు 2 న్ను— పంచలు 2 న్ను టవల్సు 2 న్ను— వేరే మూట కట్టు—టిన్నిసరేకట్టు చేత్తో పుచ్చుకుంటాను. ఈయింట్లో సీనారేకుసిబ్బి కూడా మనకొద్దు. కట్టుబట్టలతో పోదాం.'

'మీ ఆజ్ఞ'

'ఆజ్ఞో—అర్ధాన్నమో— తెల్లవారకముందే ప్రయాణం— నేనల్లా వీధిలోకి పోయొస్తాను.'

'భోజనం చెయ్యరూ?'

'నాకేమీ అక్కర్లేదు—కడుపు నిండుగావుంది.'

అంటూ చొక్కా తొడుక్కొని ప్రకాశరావు వీధిలోకెళ్ళిపోయాడు. భార్యనాటి పరిస్థితులు తల్చుకుంటూ ఆగదిలోనే ఆలోచనా సముద్రంలోమునిగి— ఓచాపమీద పడుకుంది.

శరభయ్యగారూ— ఆయన రెండవభార్య—కాంతారత్నం—ఒకరికొకరు దగ్గరగాకూర్చొని భోజనాలుచేస్తున్నారు. ఏవేవోకబుర్లు చెప్పుకుంటున్నారు. శరభయ్యగారు మధ్యమధ్య చలోక్తులాడుతున్నాడు. కాంతారత్నం విఱగబడి నవ్వుతోంది.

ఒకయింట్లోనేవున్న నాల్గుజీవులలో రెండు మహదానందంలో మునిగి తేలడమూ-మరోరెండుజీవులు మహాదుఃఖంలో కడుపు[illegible]లో అల్లాడిపోవడమూ?—పాడుదైవం—ఛీ!!!

---

## 2

శరభయ్యగారి తాతముత్తాతలనాటినుంచి కాకినాడదగ్గరవున్న ఓ పల్లెటూరు వారినివాసం. ఏదో పెద్దలు కూటికీ గుడ్డకు కరువులేకుండా కాలక్షేపం చేసారుగౌరవంగా. ఈయన చదువు కొద్దిగాచదివాడు. ఎలకమీద పిల్లిని పిల్లిమీద ఎలకని ఎక్కించడంలో ఘనుడు. ఆపల్లెటూళ్ళో యింతకన్న గొప్పబుఱ్ఱ లుండడంచేత ఈయన ఆటలు సాగలేదు. అంచేత అవూళ్ళోవున్న—కొంపాగోడీ—2 ఎకరాలుపొలము అమ్ముకొని కాకినాడచేరాడు. అప్పటికి ప్రకాశరావుకి నాలుగోపడు—అతని తల్లి—తండ్రి—ముగ్గురూ కాకినాడచేరి చిన్నయింట్లో అద్దెకున్నారు.

శరభయ్యగారు రెండునెలలుపాటు అటూయిటూ తిరిగాడే కాని తర్వాత ఓషావుకారిదగ్గర నెలకి 20 రూపాయల జీతంమీద కోర్టు

పనులుచూడ్డాని కొక్కడిరాడు. ప్రవేశించిన వేళావిశేషంచేత అందులో తొందరగా మంచిపేరొచ్చి పెద్దషావుకార్లంతా అతనిమీద—మా దగ్గిరుంటారా—మాదగ్గిరుంటారా అని విరగబడ్డారు. దాంతో శరభయ్యగారిజీతం నెలకి 60 దాకా డేకింది.

పాతషావుకారు భరించలేకపోయాడు. ఉద్యోగపుటునికి మారింది. క్రమంగా బాగా ఆర్జనసాగించాడు. ప్రకాశరావు తొందరగా బుద్ధిమంతుడు—చురుకైనవాడూ కాబట్టి—కాకినాడ కాలేజీలో ఇంటరు ప్యాసయ్యాడు. బి. ఏ. చదవడానికి రాజమండ్రివచ్చి హాస్టల్లోనేవుండి చదువుతున్నాడు.

ఇంతలో అతనికి మాతృవియోగంకలిగింది. తల్లి మరణానంతరం కొద్దిరోజులకే వివాహమయింది. అయినింటివాళ్లు చదువుచూచి పిల్లనిచ్చారు. శరభయ్యగారంతవరకూ పిల్లవాణ్ణికన్నుల్లో బెట్టుకు పెంచిచదువు చెప్పించి గారాబంగా చూశాడు. ఆయనికి రెండో పెళ్ళి చేసుకోవాలనే తలంపుకలిగి రెండువేలిచ్చి ఓపిల్లనెక్కడో తెచ్చుకున్నాడు. ఆతల్లి గుమ్మంల్లో అడుగెట్టింది. కొంపలంటుకున్నాయి— ప్రకాశరావా సంవత్సరం ఫస్టుక్లాసులో ప్యాసుపుచ్చుకోవలసిందానికి— మాతృవియోగదుఃఖంచే క్రుంగిపోయి—ఏదో ప్యాసయ్యాడు-భార్యగూడా కాపరానికొచ్చింది.

అనంతరం ఏడాదిగడచినపిమ్మట వెనుకటి ప్రకరణంలో చదివిన తండ్రికొడుకుల ప్రసంగం జరిగింది. ప్రకాశరావు తెల్లవారితే యింట్లో నుంచి వెళ్ళిపోవాలిగనుక యెవర్నోనా అడిగి పదిరూపాయలు తెచ్చుకుందామని ఊళ్ళోకిపోయాడు. అతనిభార్య కడుపాకలతో ఉసూరుమంటూ గదిలో పడుకుంది.

శరభయ్య-కాంతారత్నము లోపల కులాసాగా భోజనంచేస్తూ ఈవిధంగా మాటలాడుకున్నారు.

'ఏమండీ! వాళ్ళిద్దరికీతిండో'

'ఇవ్వేళకేకదూ—ఇంతపడెయ్యి'

'అలాంటున్నారేమిటి?'

'రేపు వాళ్ళిద్దరూ వెళ్ళిపోతారు'

'ఎక్కడికిపోతారు—ఎక్కడికి వెళ్ళరు—ఈయనకప్పుడే ఉద్యోగం అంటూ వదిలిసిందా యేమిటి?'

'ఉద్యోగమో—సద్యోగమో — ఏదో ఒకటి అఘోరిస్తారు మనకెందుకూ?'

'దారిబత్తాలకు డబ్బో'

'నన్నడిగాడు పదిరూపాయలు—లేవుపొమ్మన్నాను'

'మరి లేకపోతే కదలడేమో?'

'కదలకేంచేస్తాము? ఖచ్చితంగా చెప్పేశాను— నావల్ల కాదు— నే తిండి పెట్టలేనని'

'ఖచ్చితంగానే చెప్పేశారన్నమాట!'

'చెప్పద్దూ—చెప్పకపోతే నీమాటకు అడుగు తప్పినవాడ నౌతాన్నానుగా'

'అంతా నా నెత్తిమీదకే తోసేస్తున్నారన్నమాట'

'నువ్వు చెప్పమన్నదేగా—మళ్ళా ఇలాఅంటావేం?'

'నేను చెప్పమన్నానని చెప్పారుగాని మనసులో చెప్పాలని లేదన్నమాట'

'లేకపోవడమేమిటి—ఎంతకాలమీపీడ భరించడం'

'రేపట్నించి ఇరుగుపొరుగువాళ్లు— దానిపుట్టింటాళ్ళు నాకు బడేమస్తారు'

'నేచెపితే నీకుబడెందుకేడుస్తారు—వాళ్ళకుమాత్రం తెలియదా ఏమిటి? బి. ఏ. ప్యాసై వాజమ్మలా యింటో కూచున్నాడని'

'లోకం అలాంటుందా—సవతమ్మ చేసింది దంతాలంటుంది'

'అనుకుంటే అనుకోనియ్యి—మనకేం'

'పరేగాని దారిఖర్చుకైనా లేకపోతే ఎలావెడతారు. ఎక్కడికెడతారు?'

'ఎక్కడికో పోతారు—మనకేల?'

'దాని పుట్టింటికి తీసుకుపోతుందేమో!'

'పోతేపోనియ్యి'

'పొరపాటున అన్నం మనిద్దరికే వండాను'

'మొదలకండావున్నాయో'

'రభసచేస్తారేమో?'

'ఇంట్లోనూకల్లేకవండలేదంటాము'

'మీరుతిన్లేదా అంటారేమో?'

'మా మట్టుకేవున్నాయి. అనిచెప్తాను'

'మీరు నిర్మొహమాటంగా చెప్పెయ్యాలి'

'ఓ! బేషుగ్గా—చెవతాను'

ఏమీ మొగమాటం పడకండి'

'ఎంతమాత్రంపడను—గాని ఏదోఒకసారిటు తిరుగూ'

'అదే ఒద్దన్నాను'

'ఏం'

'చుట్టకంపు—పొడుంకంపూను'

'నువుచెప్పినట్టల్లా వింటున్నా ఇంతేనా?'

'ఏంపెద్దవినేశారు?'

'వినలేదా?——వాళ్ళిద్దర్నీ యింట్లోనుంచి తరిమెయ్యమంటే రేపో మాపో పొయ్యేటట్లు చేశాను. లేదా—ఉన్నపొలం కొంప—నీపేరరాయమంటే రాయడానికి సిద్ధంగావున్నానా—లేదా?'

'ఏపనీయింకా జరగలేదు—అంతతొందరేమిటి?'

'తొందరగాదూ – ఏడాదిచిల్లరైంది నువొచ్చి —— ఒక్కమాటేనా...'

'ఒక్కమాటేనా—ఏమిటది—నాకసహ్యం—దూరంగా వుండండి'

'ముట్టుకుంటూనేదో పమా'

'వద్దనిచెప్పినవన్నీ చెయ్యాలి'

'ఉండబట్టలేక—

అంటూ భార్యను బిగ్గరగా కౌగలించుకొని హాయి-హాయి—అన్నాడు. అమాంతంగా చేతులో ఉన్న గిన్నెతీసికొని నెత్తిమీద కొట్టింది. వెనక్కు జారిపడి మొఱ్ఱోఅన్నాడు. ఆవిడ చీదరించుగుంటూ—దొడ్లోకిపోయింది.

ఇదంతావింటూ—చూస్తూ—ఉన్న రాజేశ్వరి— లటాలున మామగారు పడిపోయిన చోటికొచ్చి—రెండురెక్కలూపట్టుకుని లేవదీసి కూచోబెట్టి కాలురాస్తోంది. శరభయ్య బిక్కమొహం వేసుకుని పెళ్ళాం వస్తూందేమోనని దొడ్డివైపు చూస్తున్నాడు.

అంతలో కాంతారత్నం యింట్లోకొచ్చి—మావగారికి కాళ్ళు రాచేకోడల్ని చూసి—

'ఇహానేం—దివ్వకాయి—రాలుగాయి—సిగ్గా—లజ్జా—పరువా—ప్రతిష్టా—ఇటువంటివాళ్ళు కనకనే యిల్లావుంది—

అంటూ ధుమధుమలాడుతూ—కాళ్ళు నేలనేసి కొడుతూ—తోవలో—అడ్డంవచ్చినవన్నీ — తన్నిపారేస్తూ — వీధిగుమ్మంల్లోకెళ్ళిపోయింది.

శరభయ్య నింపాదిగాలేచి కుంటుకుంటూ పెళ్ళాం వెనకాలే—వీధిలోకెళ్ళాడు. అచటిదృశ్యంచూచి అతనికళ్ళుజిగేలు మన్నాయి—చటాలున తలుపు చాటుననక్కాడు.

కాంతారత్నం ఎవరితోనో కూలాసాగా మాట్లాడుతోంది. అవన్నీ లోపలున్న శరభయ్యకి వినుపిస్తూనేవున్నాయి—కాని కొద్దిగా చెవుడుండటంచేత బాగావినిపించటంలేదు. కాని—కొన్ని మాటలు స్పష్టంగానే వినబడ్డాయి.

అందులో—రావూ!— రేపురాత్రి—దొడ్డితలుపు 11 గంట లకి తీస్తా—ఒట్టెయ్యి......ఈమాటలు వినిపించాయి.

కాని యింతట్లోకేమాయదగ్గు ఆగకదగ్గాడు. కాంతారత్నంచటా లున వెనుదిరిగి మొగుణ్ణిచూసి రుసరుసలాడుతూ—ఇంట్లోకి పోయింది.

శరభయ్య సావిట్లో కూర్చుని—ఎవరితో చెప్మా — ఇది మాట్లాడుతోంది. రేపురాత్రిట—దొడ్డితలుపులు—తీస్తుందిట - ఒట్టె య్యాలిట—ఇదేవిటో తెలుసుకోవాలి—

అంటూనేలమీద చేతులానిలేవబోతూ—తూలి కిందకుపడ్డాడు. ఆసమయానికే ప్రకాశరావు వీధిగుమ్మంలోకొచ్చాడు. తండ్రిపడిపోవ డంచూచి—గబగబావచ్చి లేవనెత్తి—నడ్డి సర్దాడు—కాని తండ్రి పైకిలేచాపుడు తలమీదిబొప్పి చూసాడు.

'ఇదేమండీ—ఈబొప్పేమిటన్నాడు'

'ఇందాకా దొడ్డిగుమ్మంవువాసం తగిలిందన్నాడు తండ్రి'

'ఏదేనావెయ్యండి—లేకపోతే వాస్తుంది'

'అదేసర్దుకుంటుంది—అంటూ భార్య ఉన్నచోటికెళ్ళాడు.

ప్రకాశరావు తనగదిలోకెళ్లాడు. రాజేశ్వరి లోపలికి దించుకు పోయిన కడుపుతో—కన్నులతో మంచంమీది పడుకొని దొర్లుతోంది. ఆమెనుచూచి ప్రకాశరావు—

'అన్నం తిన్నావా?'

'మీరు తిన్నారా?'

'కాఫీ దిట్టంగాతాగాను—'

'సరేలెండి—ఊరుకోండి'

'తిండి తినకపోతే—, ఇవ్వేనా తినమని రెండుపొట్లా లామె కిచ్చాడు'

'ఇవన్నీ ఎందుకు తెచ్చారు'

'లేకపోతే చస్తామా—'

'దబ్బెక్కడిదండీ?'

'ఓ స్నేహితుడిచ్చాడు'

'ఎంత!'

'ఇరవై'

'ఎవరాయన?'

'నువ్వా ఎరుగుదువు — వేళాపాళాలేకుండా మనింటికొచ్చి నాన్నతోను—పిన్నితోను—బాతాఖానీ వేసే ఎజ్రటాతను'

'మీకెక్కడ కనిపించాడు'

'ఎందర్నో అడిగి అడిగి బిక్కమొఖం వేసుగొస్తోంటే కలిసాడు'

'ఇప్పుడిక్కణ్ణుంచే వెళ్లాడు'

'మనింటికొచ్చాడా?'

'వీధులోనుంచుని అత్తగారితో ఏవో మాట్లాడి వెళ్ళాడు'

'ఏమోలే — అది మనకెందుకు?— కాని ప్రయాణానికన్నీ సర్దావా ?'

'ఆహా! ప్రయాణమెప్పుడు'

'తెల్లవారుజామునే'

'సరే—అన్నీ నాపెట్టెలోనే సర్దాను'

'అలాకాదు—నావి వేరే మూటకట్టు'

'మాకేం కర్మమండీ—ఈపెట్టేపట్టు కెదుమరుగాని'

'ఈ విషయంలో—నేను చెప్పినట్లు చెయ్యి'

'చెయ్యటానికాదు— మీరు నా వెంట అక్కడికూడా రారా?'

'అవకాశాన్నిబట్టి'

'నన్ను దిగవిడిచి—మనభవిష్యజ్జీవితనౌకను సాగించే విధానాన్ని గూర్చి—మాఅన్నయ్యతో గూడా ఆలోచించి సలహాచేసి వెళ్ళొచ్చును'

'సరేగాని నిన్ను కూడా తిండికి పిలవలేదన్నమాట'

'పిలిస్తేమాత్రం మీరు తినందే నేను తింటానా—కాక మన విషయంలో వారు భేదాభిప్రాయంలో వున్నారు. వారిద్దరూ భోజనం చేస్తూచెప్పుకున్న మాటలన్నీ నా చెవిని పడ్డాయి'

'ఏమిటవి?'

'ఇప్పుడుకాదు—తరువాత చెపుతాలెండి'

'సరేలే—కడుపులో కాళ్ళెట్టుకు పడుకుందాం—బండికూడా చెప్పివచ్చాను. నాలుగింటికే లేవాలి—బండివాడు లేపుతాడు—'

అనుకుంటూ వారిద్దరూ ఆకలిబాధను మాటలతోనే-శాంతింప జేసికొని నిద్రాదేవి ఒడిలోదూరారు.

శరభయ్య కాంతారత్నం రాత్రికూడా పొట్టనిండాతిని పడగ్గదిలోకి చేరారు—

'నువ్వుకూడా ఈ మంచంమీదికి రా అంటాడాయన'

'ఆ వెధవవాసన బొంతమీదపడుకోడానికి నాకర్మమేం కాలిందంటుందావిడ'

'నేనా మంచంమీదికి రానా-అంటాడాయన'

'వద్దు—ఈమాటు రెండోవేపున కూడా బొప్పిగడుతుంది'

'నువ్వు చెప్పినట్లల్లా విన్నా—ఇలా ఏడిపిస్తావేం'

'నోరుమూసుకు పడుకోమని'

'చలిబాగా వేస్తూంది'

'అరవై యేళ్ళ నాకికి నీకే బాగాచలేస్తూంటే — పద్దెనిమిదేళ్ళ దానికినాకెంత చలిబాధో'

అంచేతే—యిద్దరం—ఈ మంచంమీద... ఆ మంచంమీద— అన్నాను.

అమ్మపెట్టేవి నాలుగూ పెటితేనేగాని అయ్యనోరుకట్టడు'

పోన్లేనే—దీనిమీదే పడుస్తానని—గుజ్జుటై నిద్రపోయాడు. శరభయ్య—కుళ్ళిపోయిన బొంతసాయంగా—కుక్క మంచంమీద!!!

కాంతారత్నం రాజకీవిగా పందిరిమంచంమీద దోమతెరలో వెల్లగిత్తులా పడుకుని ఏమేమో ఆలోచిస్తూ కళ్ళుమూసింది.

తెల్లవారుజామున నాలుగ్గంటలముందే బండివాడు ప్రకాశరావు గారూ అంటూ కేకపెట్టడం మొదలెట్టాడు. ఆ కేకలకి కలతనిద్రలోవున్న రాజేశ్వరిమేల్కొని భర్తను లేపింది. అయిదునిమిషాలలో సర్దుకున్నారు. తనమూటా—భార్య పెట్టె—ప్రకాశరావు బండిలో పెట్టాడు.

ఇప్పుడు తండ్రితో చెప్పి వెళ్ళడమా—చెప్పకుండా వెళ్ళడమా-అని నాల్గునిమిషాలాలోచించి తండ్రి పడుకున్న గది దగ్గరకెళ్ళి—తలుపు నాలుగు సార్లు తట్టాడు—శరభయ్య కళ్ళునులుపుకుంటూ వచ్చి తలుపుతీసాడు.

రాజేశ్వరీ ప్రకాశరావు లొక్కసారిగా వెళుతున్నామండీఅన్నారు. కృష్ణవేణి మేలుకునేవుంది. ప్రకాశరావు 'పిన్నీ' అనిలేపి సెలవిప్పించ మన్నాడు. రాజేశ్వరి వెడతానండీ అంది.

'సరేలే—పోనురా'

అని నసుగుతూ తన పంతం చెల్లి నందుకు లోలోన సంతోష మందుతూ—పందిరిమంచంలో దోమతెరలో దూరింది.

రాజేశ్వరీ ప్రకాశరావులు బయలుదేరారు. శరభయ్యకొక్కడికి మన సుండా—వీధితలుపుభడాలున వేసుకొని యింట్లోకెళ్ళిపోయాడు.

ప్రకాశరావుదంపతులు కాకినాడలో రైలెక్కి రాజమండ్రీలోదిగి నాళంవారి సత్రంలో బసచేశారు. రాజేశ్వరి పుట్టిల్లు పోలవరం—అక్కణ్ణించి లాంచిలో ప్రయాణం చెయ్యాలి—రాజేశ్వరిభర్త తెచ్చిన కేరియర్ మీల్సు యిద్దరికీ వడ్డించింది. ప్రకాశరావుభోజనం చేస్తూ—

'నువుకూడా కూచోమన్నాడు'

'తరవాత తింటానులెండి'

'అలాకాదు—నిన్న స్తమానమూ తిండిలేదు. నన్ను కట్టుకున్నందుకు నీకుపవాసాలు కూడా దాపరించాయి.

'ఒకరోజు తిండిలేకపోతే చచ్చిపోతామా? వారిని జమే బయట పడింది. కాని మీరుతిని నేను తినకపోతే అది ఉపవాసంగాని— నాతో పాటు మీరుగూడా పస్తున్నవుడు కాదు. పడినగోడలుపడినట్లుగా వుండవు.

'రాజూ! లాంచీయెక్కినై వెళ్ళిపోలేవా'

'మీ కాళ్ళట్టుకుంటాను—ఆమాటనకండే'

'నాకక్కడికి రావడానికి సిగ్గుగావుంది'

'అలాభిడియపడకండి. మాఅన్నయ్యతో గూడా సలహా చేతాము'

'రావటానికి మనసొప్పడంలేదు'

'నా మాటవినండి—మీరక్కడొక్కరోజు కన్న ఎక్కువుండద్దు'

'నీమాట కెదురాడలేకుండా వున్నాను. ముందుకడుగుపడటం లేదు'

'మరేం ఫరవాలేదు'

అనిమాటలాడుకుంటూ భోజనం ముగించారు. లాంచీదగ్గరకెళ్ళి ఎప్పుడు బయలుదేరుతుందో కనుక్కొస్తానుండుమని ప్రకాశరావుబయలు దేరిరేవులోకి వెడుతున్నాడు. ఇంతలో ప్రకాశరావుతో చదువుకొని— అతనితోపాట్నరుగా ఔస్సిసాడుతూ మిత్రుడుగావుండే ముత్యాలరావు కనుపించాడు.

, ఏమోయి— ప్రకాశరావు— గుడీవినింగ్ '

హల్లో! గుడీవినింగ్— మిస్టర్— యం. పి రావు '

, ఎక్కణ్నించిరాక— ఏంజేస్తున్నావు? '

, ఇంటిదగ్గరనుంచే వచ్చాను—నిరుద్యోగ డిపార్టుమెంటులో హాయ్యెస్టుపొజిషన్ ముందిప్పుడు '

, అలానా '

, నువ్వేంజేస్తున్నావోయ్—రావ్ '

, నేనిక్కడ సివిల్ సప్లయిస్ లో ఒకశాఖకి మానేజరుగావున్నాను

, ఏదో చేస్తున్నావుగాని—నీ ఉద్యోగ మొంమకోయి '

నిజానికంతేగాని— సోమరిగావుండలేకనే '

' వాళ్ళెంతిచ్చినా నీసాదరికి చాలదు. '

' 150—జీతం—ట్రావిలింగ్ — ఓ 50 వస్తాయి — జమాఖర్చు నువ్వే చెప్పినట్టే '

' అదృష్టం '

' ప్రకాశ్—నువ్విలా కాళీగావుంటంనాకు చాలావిచారంగావుంది '

' ఏంచెయ్యమన్నావ్— కాకిగంకరువులోగూడా అప్లి కేషన్లకి అరరీము తగలేసాను. '

' ఏమీలాభం లేకపోయిందన్నమాట '

' ఔను '

' నాన్నగారు బాగున్నారా? '

' క్షేమంగా—కాని నాకూ— ఆయనకు— ఏమీసంబంధంలేదు— చిరకాలమిత్రుడవు గాబట్టి చెపుతున్నాను. ఈరెండేళ్లు—నానా అవస్థలూ పడ్డాను—చూస్తూ — చివరికి—తిండి పెట్టలేను నువ్వూ పెళ్ళాం లేచిపొండని మొన్నటిరోజున ఫర్మానాయిచ్చాడు. దారిఖర్చులకు పది రూపాయిలిమ్మంటే—చిల్లిగవ్వ ఇవ్వను పొమ్మన్నారు— నీబోటివాడిదగ్గర పదిరూపాయలు పుచ్చుకొని బయలుదేరి కుటుంబంతోగూడా యిక్కడి కొచ్చాను. '

' ముందేం చెయ్యదలుచుకున్నావ్ '

' నాకేమీతోచడంలేదు— ఇహారాయల్ డిపార్టుమెంటు— మిల్టరీ డిపార్టుమెంటు—కనుపిస్తున్నాయి—చిన్ననాటి స్నేహితుడవు—నీవుకనుపిం డంతోటే ప్రాణంలేచొచ్చింది. సలహాఏదేనా చెప్పవోయ్ '

' మిల్టరీలోకిమాత్రం పోవడం నేను సహించను '

' ఏదారీకనుపించడంలేదు—ఏదెన్నాళ్లొస్తాయి '

'నేనొక్క సలహా చెపుతాను. అలా చెయ్యి'

'తు-చ-తప్పకుండా'

'ఇదుగో-మెద్రాసులో—ఈ చిరునామాదారుని కలుసుకో-నీకు తప్పకుండా—ఏదో ఒకటి మంచిది దొరుకుతుంది'

'అందుకనుకుంటే—ఇదివరకే పోయేవాణ్ణి పట్నం'

'డబ్బుకోసం జంకకు—నేను 80 రూపాయిలిస్తాను. వెంటనే వెళ్ళి-ఆ చిరునామాదారుని కలుసుకో- అతడు గ్రామాంతరం వెడితే-వచ్చేదాకా వుండు-నేనుకూడా ఓ కవరతనికి రాస్తాను—'

అంటూ పర్సుతీసి 8-పదిరూపాయిల కాగితాలు చేతిలో పెట్టాడు

'డబ్బింకా కావలిస్తే నాకు రాయి — అంతేగాని అతన్ని కలియకుండా—వెనక్కి మళ్ళకు?'

'రావూ! నీ ఋణం నే నెట్లా తీర్చుకుంటాను'

'అలా అనకోకు— నిజం తెలుసుకుంటే-నీకు నేనే ఋణపడి వున్నాను. నేను నీతో చదవడంవల్లనే కాలేజీ మెట్లు తొందరగా ఎక్కి—బి. ఏ. అనిపించుకున్నాను'

'నే చేసిందేముంది'

'అలా నేవుంటుంది. నాకు మట్టుకా నమ్మకం నాటుకు పోయింది. నీకూడా ఏదేనా ఉద్యోగం దొరికితే, నాకు దొరికిన దాని కన్న ఎక్కువగా సంతోషిస్తాను'

'సజ్జన లక్షణం'

'ఇలా ఎక్కడికి బయలుదేరావు'

'పోలవరంలాంచి ఎంతకి బయలుదేరుతుందో. తెలుసుకుందామని—'

'ఎందుకు'

'నా భార్య పుట్టిల్లు పోలవరం ఆమె నక్కడ దిగవిడిచి వెళ్ళాలి'

'లాంచీ మళ్ళీ రేపుదయం బయలు దేరుతుంది. రెండుగంటలకే వెళ్ళిపోయింది'

'రేపుదయమే వెడతాను'

'కాఫీత్రాగి పోదాంరా'

అంటూ వరదరాజస్వామి ఆలయంలో ప్రవేశించి గర్భగుడిలో దూరి ఆరాధన మొదలెట్టారు. ముత్యాలరావు ప్లేటుమీదప్లేట్లు తెప్పించి స్నేహితుని ముందర పెట్టేస్తున్నాడు ఇవన్నీతినలేనోయి అంటాడుప్రకాశరావు—ఫరవాలేదోయి అంటాడుమిత్రుడు—గర్భపూజ పూర్తయింది.

ముత్యాలరావు నాలుగైదు తినుబండారాలు పొట్లాలుకట్టించి బయటకొచ్చి రెండుకిళ్లీలూ, సిగరెట్లూ పుచ్చుకొని, కిళ్లీ సిగరెట్టు ప్రకాశరావు కందిచ్చాడు. ఇంతలో కనుపించవు నేను వెళ్ళొస్తా, నాకుత్తరాలురాయి, ఈపొట్లాలుతీసికెళ్ళుమని చేతికిచ్చాడు. ప్రకాశ్ మాటు మాట చెప్పలేక గుడ్బైచెప్పి యింటికొచ్చాడు..

రాజేశ్వరిభర్త యింకారాలేదేమాఅని ఆలోచిస్తూ పెట్టెమీద కూర్చుంది టెన్నిస్ రేకట్టుమడిమతో వొత్తుతూ—

ప్రకాశరావుచేతిలో పొట్లాలు—నోటిలోకిళ్ళీ సిగరెట్లు— జేబులో ఖరీదైన మనీపర్సు— వీటితో గదిలో ప్రవేశించాడు.

'ఇంతసేపున్నారేమండీ? లాంచీఉందా?'

'లాంచీరెండింటికే పోయిందట—రేపుదయం 7 గంటలకు బయలుదేరుతుందట.'

'ఇవ్వేళకి ప్రయాణం లేదన్నమాటే'

'లేదన్నమాటే'

'ఇవన్నీ ఎక్కడివి—ఎందుకు?'

'ఎందుకేమిటి—తినడానికి'

'డబ్బుకాస్తా యిక్కడే ఖర్చుచేస్తే మీప్రయాణానికో'

'నేను కొనలేదు.'

'కొనకండా ఎలావొస్తాయి'

'నాతో చదువుకొని– నాతోపాటున్నరుగా అడి బి. ఏ. ప్యాసై ఇవ్వాళ్లో వుద్యోగంచేస్తూన్న మిత్రుడొకడు కనిపించాడు. సమాచారాలడిగాడు–పరిస్థితులు తెలుసుకొన్నాడు– మద్రాసులో వుద్యోగంకోసం ఒకరిని కలియుమని–అడ్రసిచ్చాడు– ప్రయాణానికి–ఖర్చులకు – నెలకు సరిపడ్డడబ్బిచ్చాడు. అతడే యివన్నీయిచ్చాడు—

'ఉత్తముడు కాబోలు'

'ఉత్తముడేకాదు–విత్తముడుకూడాను'

రాజేశ్వరి బలవంతంమీద ఓ పొట్లంవిప్పింది. లెక్కనవిపెట్టి మీద పెట్టింది. ఇవి పెట్టెలో దాచమని పదిరూపాయలు నోట్లు 8 ఆమె చేతికిచ్చాడు. వాటిని కళ్ళుసద్దుకొని దాచింది.

సాయంకాలం ప్రకాశరావు కేరియర్ మీల్సు తెచ్చాడు. ఇద్దరూ కడుపునిండాతిని ఆరాత్రి అక్కడే పడున్నారు. తెల్లవారకుండానేలేచికాల కృత్యాలు తీర్చుకొని గోదావరీస్నానంచేసి వచ్చారు.

అదేసమయంలో నాళంవారి సత్రంలో ఓచోట ఏదోగలాభాజరుగుతోంది. పదిమందికాదు– వందమందిచేరారు. ప్రకాశరావు కమీజు తొడుక్కొంటూ తానుకూడా ఆగుంపులోకెళ్ళాడు– అతనికళ్లుజిగేలుమన్నాయి–కాళ్లువణికాయి–చేతులుచల్లబడ్డాయి.

కారణం ఏమిటంటారా?

ఎదురుగుండా అతనిసవతితల్లి కాంతారత్నం– ఆమెప్రక్కనఒక పాతికేళ్ళయువకుడు– కనబడ్డారుముందు– ఆగుంపులోదూరిన ప్రకాశరావుకదేమిమొదట అర్థంకాలేదు.

అక్కడిజనమంతా ఆవిడ కాకినాడనుంచి ఎవణ్నో తీసుకొని లేచొచ్చిందట. ఆమెభర్త వెతుక్కుంటూవస్తే తెల్లవారుజాము నిక్కడదొరి

కారుట—తనతో రమ్మని భర్త భార్యనడుగుతూంటే- ఆమెవెంటవచ్చిన యువకుడు- ఆమె భర్తనిచేతి బెత్తంతోకొట్టి- బూటుతోతన్నాడు— రక్తంకారుతోంది_ పోలీసులొచ్చి వార్ని ముగ్గుర్ని స్టేషనుకు రమ్మంటున్నారు—

, మేందొంగలంకాము- రాం- అంటుందిట ఆవిడ

, మాయిద్దరకీ యిష్టమైంది— చల్ మోహానరంగా అంటాట్ట యువకుడు.

, కొంపముంచావే అని నోరూ—నెత్తి కొట్టుకుట్లూంట భర్త—

ప్రకాశరావీమాటవిని అక్కడుండలేక భార్యదగ్గిరకొచ్చి- తొందరగా బయలుదేరి- దొడ్డిమార్గాన లాంచీరేవుకు చేరుకున్నాట్ట.

రాజేశ్వరి ఆగలభాయేమిటని అడిగితే సంగతంతా ఆమెకి విప్పి చెప్పాడు.

, అనుకున్నంతపనీ జరగడానికి 24 గంటలు పట్టలేదన్నమాట?అని నోరునొక్కుకుంది.

పోలవరంలాంచి మధ్యాహ్నం 12 గంటలకు రేవుకు చేరుకుంది. ప్రకాశరావు దంపతులు లాంచిదిగి తిన్నగా రాజేశ్వరి పుట్టింటికెళ్ళారు, ఆమెఅన్నవారి నాదరించాడు, పరిస్థితులు విన్నాడు-తోచినసలహాలు చెప్పాడు.

ఎవరెన్ని చెప్పినా ప్రకాశరావు తనమిత్రుడు ముత్యాలరావుచెప్పి నవంధానే నమ్ముకొని మరునాటిరాత్రి మెయిలుకు కొవ్వూరొచ్చి మెడ్రాస్ మెయిల్ ఎక్కాడు.

——

## 3

'మిస్ లీలతో సింగిల్సుఆడే ఆ ఛాంపియన్ ఎవరండి'

'ఏమో! నాకూ తెలియదు. కాని గొప్ప టెన్నిస్ ప్లేయర్'

'ఆట అఖండంగావుంది'

'నిన్న మీరు రాలేదు-రావుతో పాట్నరుగా డబుల్సు ఆడాడు-వారీవండర్'

'ఈ మదరాసుకు కొత్తగాబోలు'

'అయ్యి ఉంటుంది అంతా పదిహేను రోజుల్నించి కోర్టుకు హాజరౌతున్నాడు'

'ఈ సాయంత్రం 6 గంటలకి డబుల్సుందిటగా'

'ఎవరు చెప్పారు?

'పార్కులో చెప్పుకుంటున్నారు.

'చూచి తీరవలసిందే- లంచికి పోయొద్దాం. ఇవేళ సెలవేగా? '

'మనకేంపని లేదివ్వేళ- తనివితీరా ఆటచూద్దాం'

అని చెప్పుకుంటూ విక్టోరియాపబ్లిక్ హాలు ప్రక్కనుంచి ఇద్దరు స్నేహితులు పోతున్నారు — ఆటెన్నిస్ప్లేయర్– ఎవరో?— అతడే ప్రకాశరావు.

ప్రకాశరావు భార్య రాజేశ్వరిని పోలవరంలో దిగవిడిచిమరునాడే మెయిలెక్కి మెడ్రాసువెళ్ళాడు ముత్యాలరావు యిచ్చిన చిరునామాకు వెళ్ళాడు- అతనిపేరక్కడ చెప్పటంతోటే ఆనుతుడు ప్రకాశ్ని ఆదరించాడు. ఆమర్నాడే యమ్. పి. రావు ఉత్తరంకూడా వచ్చిందా స్నేహితుడికి.

అతడు మదరాసులో ప్రఖ్యాతినొందిన ధనుకుడు గాకపోయినా చాలా పలుకుబడికలవాడు- అన్ని పార్టీలవారితోను కలయికగావుంటాడు. డబ్బుకూడా చాలినంతవుంది- పైగా గవర్నమెంటు ఎసెన్సియల్ డిపార్టుమెంటులో 8 వందల జీతం. మనిషి దర్జాగావుంటాడు— ఆఫీసుకు పోవడానికి కారు- నౌఖర్లు- చాకర్లు. అంతావుంది. అతనికి టెన్నీసంటే మహాఆప్యాయం.

ముత్యాలరావు తనస్నేహితుడైన వినాయకరావుకి వ్రాసిన ఉత్తరంలో ప్రకాశ్ గొప్ప టెన్నిస్‌ఛాంపియన్ — నిరుపేద — బి. ఏ. అతన్నాదరించి యేదేనా ఉద్యోగం ఇప్పించమని రాసాడు. అంతటితో ప్రకాశాన్ని నెత్తిమీద పెట్టుకొని విశ్వప్రయత్నం చేస్తున్నాడు ఉద్యోగానికి — చిన్న ఉద్యోగమైతే ఈపాటికే సాధించేవాడు.

ఆవేళ సాయంకాలం ప్రకాశ్ ఎక్కడెక్కడో తిరిగి సాయంకాలం 4 గంటలకింటికి చేరాడు. లోపలకూర్చుని టెన్నిసు రేకట్టు గట్ చేసుకుంటున్నాడు. అంతట్లోకే గేటులో కారాగిన హారన్ సౌండు వినిపించింది. నెమ్మదిగా బయటకొచ్చాడు. చేతిలో టెన్నిస్ రేకట్టుంది. వినాయకరావు చూచాడు.

లోపలకెళ్ళి షికారుడ్రస్ వేసుకొని — టెన్నిస్ బేట్ — చంకనెట్టుకొని వస్తారా — విక్టోరియాగ్రౌండుకు పోదాము అన్నాడు.

'రేకెట్ రిపేర్లోవుందండి'

"నాదగ్గిర ఎక్స్ట్రా రేకట్టుంది — దాంతో ఆడుదురుగాని'

'తమచిత్తం'

'ఇదిగో రేకట్టు'

అంటూ చేతికందించాడు. ఇద్దరూ కారులో కూర్చుని గ్రౌండు దగ్గిర దిగారు. ఎవరో సింగిల్సు ఆడుతున్నారు. ఆ ఆట కంప్లీటు కావడంతోనే వినాయకరావు చేత్తో బేటుపుచ్చుకొని లేచాడు. ప్రకాశ్‌ని కూడా రెడీ అన్నాడు. ప్రకాశ్‌ని అక్కడున్న పెద్దమనుష్యుల కెరుకపరచాడు. మరో ఇద్దరు రెడీ అయ్యారు. డబుల్స్ ఆడటం ప్రారంభించారు.

అవతల పార్టీలో మద్రాసులో పేరుపొందిన ప్లేయరు ఆడుతున్నాడు. అతని ఆటలు ప్రకాశ్‌రావు దగ్గిర సాగలేదు. మొదటసెట్టు 6—2 తోను, రెండోసెట్ 6—3 తోను, మూడవసెట్టు 6—0 (నిల్) గాను కొట్టాడు. అతనిని చూచి ప్లేయర్సంతా మూగారు.

మఱునాడు క్లబ్బంతా వినాయకరావు ఫ్రెండ్ గొప్ప టెన్నిస్ ప్లేయరని, ఆనాడు టెన్నిస్ యోధు లనిపించుకున్న యిద్దరితో — వినాయకరావు పార్ట్నరుగా డబుల్సు — ఒక యోధునితో సింగిల్సు — ఆడి రెండిటలోను విజయముపొంది సెబాస్— అనిపించుకున్నాడు.

వినాయకరావు మహదానందభరితుడయ్యాడు. మరో రెండురోజులుపోయింతర్వాత ఆక్లబ్బుకి బొంబాయిలో ప్రఖ్యాతిపొందిన టెన్నిస్ యోధుడొచ్చాడు. ప్రకాశ్ రావుని — అతన్ని సింగిల్సు ఆడమన్నారు. ప్రకాశ్ పేదవానివలె దుస్తులు వేసుకొరావడంచూసి బొంబాయియోధుడు కొంచెం అసహనభావం— అయిష్టంకనబరిచాడు. క్లబ్బుమెంబర్లందరూ పట్టుబట్టారు. ప్రకాశ్ మొదటసెట్టు ఆతనికి వదిలేశాడు. రెండుమూడు సెట్లు ప్రేక్షకులానంద భరితులయ్యేటట్లు అద్భుతంగా ఆడాడు——

కాని అతనికేమీ ఉత్సాహంలేదు. నిరుద్యోగం— తెచ్చినడబ్బంతా అయిపోయింది. వినాయకరావతన్ని గౌరవంగాచూస్తున్నాడు. అడిగితే డబ్బుదొరికిపోతుంది. మనసొప్పడంలేదు—

ఒకనాడు ప్రకాశ్ వినాయకరావుతో — ఎక్కడా ఏదీనాకు నౌకరీ దొరకడంలేదు అన్నాడు. నేను మంచిఉద్యోగం ఇప్పించాలని చచ్చు వాటికి యత్నించడంలేదు. నువు డబ్బుకు ఎంతమాత్రము చిక్కుపడవద్దు నన్నడిగితే నేనిస్తాను. ఇప్పుడేమైనా డబ్బుకావాలా?

ఇలా ఎంతకాలం మీడబ్బుతిని ఉండను. అంటే మరేంఫరవాలేదు. మంచిఉద్యోగం దొరకాలంటే రెండుమాసాలు పడుతుంది—నీకేమిలోటు— హాయిగాఉండు అని వందరూపాయలకాకితం ఒకటి చేతి కందించాడు.

ప్రకాశరావు మదరాసులో టెన్నిసుయోధు లందరితోను ఆడి విజయమందాడు. అంతలో టెన్నిస్ టోర్నమెంట్సు వచ్చాయి. వినాయక

రావు ప్రోత్సాహంమీద ప్రకాశ్ పోటీదారునిగా నిలబడ్డాడు— ప్రెసిడెన్సీలో ఎంతమంది టెన్నిస్ యోధులున్నారో అంతమందీ వచ్చారు. ప్రకాశ్— ఖ్యాతిపొందిన యోధులతో పోటీలలో పాల్గొని ఫైనల్సుకు నిలిచాడు.

ఆనాడు విక్టోరియాపబ్లిక్ హాలంతా క్రిక్కిరిసిఉంది. సుప్రసిద్ధ టెన్నిస్ యోధుడు మార్కురు— ప్రకాశ్ సింగిల్సులో ఫైనల్సు ఆడతారు. ఆట 5 గంటలకు ప్రారంభమైంది. ప్రకాశ్ ఆరోజున తనక్రీడాకౌశల్యాన్ని చూపి ఆయోధుణ్ని లవ్ సెట్టుమీద గెలిచాడు— ఆయోధుడు ప్రకాశ్ ని—నీవు ప్రెసిడెన్సీలోనున్న టెన్నిస్ యోధులందరిలోను

ఛాంపియన్,

అంటూ— షేక్ హేండిచ్చి గౌరవించాడు. మదరాసంతా ప్రకాశ్ పేరు మోగిపోయింది. పత్రికలన్నిటిలోను అతని టెన్నిస్ క్రీడానైపుణ్యమునుగూర్చి ప్రశంసలు పడ్డాయి.

ఇదంతా యెందుకు—అతడు మాసిపోయిన షూట్ వేసుకుని బ్రాడ్వేలో పోతూంటే—అడుగో—

—టెన్నిస్— ఛాంపియన్—

అననివాడు లేడు.



౪

కాలమొకరీతిగా ఎవ్వరికీఉండదుగదా—వినాయకరావు ప్రకాశ్ కు పెద్దఉదోగ్యమిప్పించాలని కొండనితవ్వి ఎలకనుపట్టజూచినంత యత్నం చేస్తున్నాడు. కార్యసిద్ధికి ఫలోన్ముఖంగావుంది. ప్రకాశ్ వినాయకరావు డబ్బుతింటో—అతనిమీద బోలెడంత ఆశపెట్టుకున్నాడు.

ఇంతలో వినాయకరావుకు భార్యావియోగం కలిగింది హఠాత్తుగా. అతనికి దాంతో బ్రెయిన్ ఫాడై ఉన్మాదావస్థలోనున్నాడు. ప్రకాశ్ ఆశ నిరాశఅయిపోయింది.

అప్పటినుంచీ ప్రకాశ్ నిరాశచెంది నిరంతరమూ మదరాసువీధులంట తిరగడం—ఎక్కడ ఏబోర్డుకనిపించినా దానిదల్లా చదువుతూవుండటం—కావలెను—అనే బోర్డుకనిపిస్తే అందులోకెళ్ళడం—నో వేకెన్సీ అనిపించుకురావడం—ఇదే అతని దినచర్య.

ప్రకాశ్ ఓనాడు ఇంక వినాయకరావు ఇంటిదగ్గరనుండి సామాం ఎత్తికట్టేదామని—తనతాలూకు సూటూ—గీటూ తెచ్చుకుందామని—వెళ్ళాడు. వినాయకరావు మేడచీడీలమీద కూర్చున్నాడు—ప్రకాశ్ కనిపించడంతోటే — ఇలారావోయ్—అని మనీపర్సుతీసి అందులోవున్న కరెన్సీనోట్లన్నీ ఆతనిమీదకు విసిరాడు. ప్రకాశ్ చేత్తోముట్టలేదు. ఏం—తీస్కో—రాస్కెల్ —అని కొట్టబోయాడు—ఆనోట్లన్నీ ఏరి కట్టకట్టి నిలబడ్డాడు—పో — యింకా యెందుకు నిలబడ్డావు—నీబాకీ యిచ్చాగా అంటూ కొట్టబోయాడు.

ప్రకాశ్ తప్పించుకొని మొగంచాటేసి తనగదిలో కాస్సేపు కూర్చుని తిన్నగా బజారుకెళ్ళాడు. నాలుగైదు సూట్లు—ఇంకా కావలసిన చిల్లరసామాను—కొనుక్కున్నాడు.

ప్రకాశ్ అసలే అందగాళ్ళలోలెక్క—అందులోనూ యీమధ్యను షోకేలాఅయ్యాడు—ఇకముందు రంగేళీ అవతాడేమో—అయితే యింత వఱకు మాత్రం అతడు రిజాలాకాడు. విలాసపురుషుడే.

ఓ షూటువేసికొన్నాడు. రిక్షావకటి కుదుర్చుకుని యింకా తిరగ్గా మిగిలిన వీధులపేర్లు—పేటలపేర్లు—చెప్పి తిప్పమన్నాడు. రిక్షావాలాడబ్బుకోసం—చెప్పనివీధులు—చెప్పినవీధులూకూడా—తిప్పుతున్నాడు

ఒకచోట నాలుగురోడ్ల మొగ ఒకటివచ్చింది. ఆనాలుగువీధులు ప్రకాశరావుకు మూడవట్టుగాతోచింది. ఇటుతిప్పరా అనుకున్నాడు. ఆనాలుగింటిలో మూడువీధులు తిరిగాడు. నాలుగోవీధులోకొచ్చేసరికి ఆవీధులో—నాలుగిళ్ళుదాటగానే ఓ బోర్డు కనిపించింది. ప్రతిఅక్షరం చదివాడు.

మరో నాలుగిళ్ళు దాటేసరికి అలాంటిదే యింకోబోర్డు—మరికొంత దూరంలో ఇంకోటి. ఇంకా కొంచెం ముందుకెడితే యింకోటి. మొత్తం నాలుగుబోర్డులగుపించాయి. నాలుగూ చదివాడు. మద్రాసులో అతని కెక్కడా అల్లాంటిబోర్డేకనుపించలేదు.

ఇదేవీధిరా—అని రిక్షావాలా నడిగాడు. కాలవదన్నాడు. బ్రాడ్వేకి నడువుమనగానే పరుగుపుచ్చుకొన్నాడు. రిక్షావాడికి డబ్బిచ్చి ఒకచోట ప్రశాంతస్థలంలో కూర్చున్నాడు.

ఈబోర్డులేవిటి? ఇదంతా మోసమా — నిజమా — వాళ్ళడిగే ప్రశ్నలు నాల్గింటికీ ముందుగా సమాధానాలు చెప్పాలిట. తర్వాత వారితో ప్రాక్టికల్‌గా కళాశాస్త్రచర్చ చెయ్యాలిట—ఓడిపోతే చెప్పు దెబ్బలట—నెగ్గితే పదివేలు బహుమానంట.

ఇదోఛాన్సు చూడాలి—విడవగూడదు—విసిరినరాళ్ళన్నీ తగులుతాయా? ఏ త్తగిలినా చాలు. రేపు తప్పక బయలుదేరి ఆవ్యవహారం ఏమిటో కడకంటా చూస్తానని అక్కణ్ణుంచి బసకొచ్చి తిన్నగా భోజనం చేసి పడుకున్నాడు.

ప్రకాశరావు సూర్యోదయానికే లేచాడు—కటింగ్ సెలూనుకు పోయి క్రాప్ దిద్దించాడు. ఇంకా చెయ్యవలసిన అలంకారాలన్నీ పూర్తిచేశాడు. సాంబారుదేవతను పూజించాడు. ఫ్లవర్ మార్కెట్టుకెళ్ళి కొన్నిరకాల మేలుజాతిపుష్పకందుకాలు కొన్నాడు. ఫ్రూట్ మార్కెట్టుకెళ్ళి కొన్నిరకాల మేలుజాతి ఫలాలుకొన్నాడు. వేటినేవిధంగా అమర్చాలో ఆవిధంగా అమర్చాడు.

కిళ్ళీకొట్టుదగ్గిర పురమాయింపు స్పెషల్ కిళ్ళీలు కట్టించాడు. మీనాక్షీవిలాస్ లో భోజనం చేశాడు. పన్నెండుగంటలయింది. ఎలక్ట్రిక్ మినర్వాషాపులో కెళ్ళి కాస్సేపు కూర్చున్నాడు. మళ్ళీ ఓసారి స్పెషల్ టాయిలెట్ షాపులో ప్రవేశించి దర్జాగా ముస్తాబయ్యాడు— కొన్ని సుగంధద్రవ్యాలుకూడా కొన్నాడు.

అంతట్లోకే అతనికో ఆలోచనతోచింది. పగటివేళ వాళ్ళువేసే ప్రశ్నలకి సరియైన సమాధానాలుచెప్పి గెలిస్తే రాత్రిప్రాక్టికల్ కు వెళ్ళాలిట. అంచేత యివన్నీ బసలోపెట్టేద్దామని ఆలోచించి బసకెళ్ళాడు.

వినాయకరావు ఏవోకాగితాలుచూస్తున్నాడు—చింపుతున్నాడు—పేలుతున్నాడు—ప్రకాశ్ అవైపుకైనా చూడకుండా తనగదిలో ప్రవేశించి సామానంతా యింటోపెట్టి వీధిలోకొచ్చి రిక్షావాలాని పిలిచి ఫలానివీధికని చెప్పి అందులో కూచున్నాడు.

రిక్షావాలా తొందరగా నిన్న ప్రకాశ్ వెళ్ళగా బోర్డులుకనిపించిన వీధిలోకి తీసికెళ్ళాడు—మొదటిబోర్డు కనిపించింది. రిక్షాదిగి బోర్డుదగ్గిర కెళ్ళాడు.

## ౧వ బోర్డు

వరాలు:—

కళాశాస్త్ర విద్యాప్రవీణులే తప్ప యితరు లీబోర్డువైపుకైనా చూడరాదు!

నేనడిగిన నాల్గుప్రశ్నలకి సరియైన సమాధానాలుచెప్పి నన్ను తృప్తిపరిస్తేనే పగటిపరీక్షలో నెగ్గినట్టు!!

పగటిపరీక్షలో నెగ్గినవారికి నేనొకటిక్కెట్టు యిస్తాను. అది జాగ్రత్తగా ఉంచుకొని దానికి నకలుగా ఒకచీటీపోటీదారుడు తన చేవ్రాలుతో నాకు వ్రాసిచ్చి రాత్రి నేను చెప్పినవేళకు ప్రాక్టికల్‌కు రావాలి!!!

ప్రాక్టికల్ పరీక్షలో నెగ్గితే 10000 రూపాయిలు బహుమానం!!!

అని చదివి అక్కడినుంచి కొంచెం ముందుకు సాగాడు. రెండవ బోర్డు కనిపించింది.

## ౨వ బోర్డు

వరాలు:—

కళాశాస్త్రకళానిపుణులే లోపలికి రావర్హులు!

నా నాల్గుప్రశ్నలకి సరియైన సమాధానాలుచెప్పి నన్ను తృప్తి పరిస్తేనే పగటిపరీక్షలో జయమందినట్లు!!!

పగటిపరీక్షలో జయమందినవారికి నేనొకవస్తువును భరిణెలో పెట్టి యిస్తాను. దానిని తెఱవకుండా వెంటనే తనవద్దనున్న వస్తువునొకదానిని నాకిచ్చి—నేనుచెప్పినవేళకు రాత్రి ప్రాక్టికల్ పరీక్షకు రావాలి!!!

ప్రాక్టికల్ పరీక్షలో జయమందితే 20000 రూపాయిలు బహుమానం!!!

అని చదివి మరికొంచెందూరం ఠీవిగా నడిచాడు—మూడవబోర్డు కనిపించింది.

## ౩వ బోర్డు

షరాలు:—

కళాశాస్త్రకళావిషయజ్ఞులే పోటీకి నిలబడతగినవారు!

నాయిచ్చు నాల్గుప్రశ్నలకు సదుత్తరములుచెప్పి నన్ను తృప్తిపరిస్తేనే పగటిపోటీలో గెల్చినట్లు!!

పగటిపోటీలోగెల్చినవారికి నేనొక ఆకును దాపరికంచేసి యిస్తాను. దాన్ని చూడకుండా ఆ ఆకుకుసంబంధించిన ఫలమును నాకిస్తే నేను రమ్మన్నవేళకు రాత్రిప్రాక్టికల్‌కు హాజరుకావాలి!!!

ప్రాక్టికల్ పరీక్షలో గెలిస్తే 30000 రూపాయిలు బహుమానం!!

అని చదివి యింకా కొంచెంముందుకు సాగగా నాలుగో బోర్డు కనిపించింది.

## ౪వ బోర్డు

షరాలు:—

కళాశాస్త్రపాండితీవిదులై — అనుభవరసికులై — ఉచితానుచితములను— సమయాసమయములనెఱింగినవారేగాని యితరులు లోనికి చొరరాదు!

నా యిచ్చు నాలుగుప్రశ్నలకు నామనసులోనున్న రీతిగా సమాధానాలిచ్చి నన్ను తృప్తిపరిస్తేనే — పగటిపరీక్షలో విజయపతాక మందినట్లు!!

పగటివేళనావద్ద విజయపతాక మందుకున్నవారికి నేనొకసంజ్ఞ చేస్తాను— ఆసంజ్ఞ చేసేటప్పుడు కన్నులు విప్పకూడదు—ప్రతి

సంజ్ఞ చేయాలి—అనా సంజ్ఞలో పుష్ప సిగూఢం తెలుసుకొని—
రాత్రిపూట ఆవేళకే రావాలి ప్రాక్టికల్‌కు!!!
ప్రాక్టికల్ పరీక్షలో విజయవతాక మందుకుంటే 40000 రూపా
యలు బహుమానం!!!!

అని చదివి యింకా ముందుకెళ్ళి ఆవీధంతా గాలించాడు. ఇల్లాటి వగుపించలేదు. పగటిపరీక్షకు హాజరవ్వాలని యింటికెళ్ళి తను బజారులో కొన్న వస్తువులన్నీ సూట్‌కేసులో వేసుకొని తిరిగి ఆవీధిలోకొచ్చాడు.

మొదటిబోర్డున్న గుమ్మందొక్కి తలుపుతట్టాడు. లోపలనుంచి పదేండ్ల బాలికవచ్చి తలుపు తెరచి పగటిపరీక్ష కొచ్చారా అంది. ఔనని తలూపాడు ప్రకాశరావు. తనవెంటరమ్మని లోపలికితీసికెళ్ళింది. ఎదురుగావున్న బోర్డులో నాలుగుప్రశ్నలుచూపి సమాధానాలు చెప్పమంది ఒక్కొక్కప్రశ్నే నువ్వుచదివితే నేను సమాధానం చెబుతానన్నాడు.

ఆబాలిక బోర్డువైపు తిరిగి—

1 ప్రశ్న:—హాస్తినీజాతిస్త్రీ రూపురేఖావిలాసము లెట్టివి?

హాస్తినిజాతిస్త్రీ మెల్లగానడచును. రెండుకాళ్ళవేళ్ళు వంకరగాను—పొడవుగాను ఉంటాయి. కంఠం కురుచగావుంటుంది — కొప్పుకపిల వర్ణముగాను — శరీరంకుదిమట్టంగాను — వలంగాను — మదనగృహము మదపుటేనుగు మకరందగంధమట్లుగను, చన్నులు బంగారుకలశాలవలెను పెదవులు వెడల్పుగాను — గంభీరహృదయం కలదిగానువుండి గాఢసంయోగానికేగాని కరుగదు.

2—హాస్తినీజాతికి ముఖ్యమైన కళాస్థానములెవ్వి?

హాస్తినీజాతి వనితకు చన్నులు ముట్టుకున్నా—చంకమూలలందుల తడివినా—రెండుచెక్కిళ్ళు చేతితోనిమిరినా— దత్తుజాతిపురుషుడు రొమ్ముల వంకచూచి—చేతులుకలిపినా—కళాస్థానాలు.

3—ఈనాటితిథివమి-హస్తిని నీనాడెప్పుడు కలియుట శాస్త్రసమ్మతము?

ఈనాడు తిథి 5—హస్తినీస్త్రీని వలచినవా డీదినమున మొదటి జామున కలియగోరి ముందు ముంగురులు చేతితోసరిజేస్తూ-చన్ను మొన లను ఆగి ఆగి మెల్లగా నలుపుచు నధరోష్ఠమును ముద్దాడుచు కలి యుట శాస్త్రసమ్మతము.

4—లాటదేశస్త్రీయే చుంబనముల నధికముగ నాశించును?

లాటదేశస్త్రీ—చంకలు—బొడ్డు—భగచుంబనముల నధిక ముగఆశించును.

ఆవిధంగా ప్రకాశ్ నదురుబెదురులేకుండా సమాధానాలు చెప్ప డంతోనే ఆబాలిక బోర్డుతోసహా లోపలికి పోయినది.

మరో అయిదునిమిషాలలో అపురూపసౌందర్యవతియైన యువతి వచ్చి టికెట్టు ప్రకాశ్ కు ఇచ్చింది—అది చూచుకొని తానొకచీటీ వ్రాసిఇచ్చాడు. ఆటికెట్టులో రాత్రి మొదటిజాము దాటకుండా రమ్మని ఉంది [illegible] కేబుల్ [illegible] వచ్చినదారినే యువతలకివచ్చాడు

[illegible] టిద్వారం తెఱచేఉంది. మనుష్యుల అలికిడి [illegible] చరి[illegible]. పన్నెండేండ్లబాలికవచ్చి అతన్ని [illegible] దీసుకొనిపోయింది ఎదురుగాబోర్డు— సమాధానాలు చెప్పి [illegible] వదిలితే నేను చెపుతాను.

1. ప్రశ్న? శంఖినీజాతి స్త్రీలక్షణములెట్టివి?

శంఖినీజాతిస్త్రీ బలము—వలముగల శరీరము—సన్ననినడుము— దళసరిపెదవులు—గట్టినైనచన్నులు—పొడవైన వెండ్రుకలు—నల్లకలువల

వంటి కన్నులు—కలిగి—పెదవికదలించునది — ఎఱ్ఱబిబ్బలివాసించునది — మదనగృహమున రోమములెక్కువగానుండునది — రతిసౌఖ్యమెక్కువగా కోరునదిగనుండి—రతిసల్పువేళ వీర్యము కొంచెముగా స్రవించునదియై—రక్కులుచేయులక్షణాలు కలిగియుంటుంది.

2. శంఖినీ ముఖ్యకళాస్థానములు తెలియునా?

ఆహా! తెలియును. ఆజాతిస్త్రీకి పెదవులు— చెక్కిళ్ళు—పిక్కలు అంటినా—కూచిమారజాతిపురుషుడు పెదవి అందముచూచినా — కళా స్థానములు.

**3. ఎల్లిటతిధియేమి? ఆనాడు శంఖిణి నెట్లువేళ గవయుట శాస్త్ర సిద్ధాంతము?**

**ఎల్లిటతిధి 7. ఆనాడు శంఖిణిని వలచినవాడు మొదటచేతితో** రహస్యస్థానమును తడవి—పెదవిచప్పరించి—మెడమీద — చన్నులమీద చెక్కిళ్ళమీద—సన్నసన్నగా గిల్లుచు—కౌగలించి—రెండవ జామున గవయుట శాస్త్రసిద్ధాంతము.

4. ప్రాతిబోధచుంబనమును వర్ణింపగలవా?

భేష్—ప్రాతిబోధచుంబనము వర్ణింపతగినదే. స్త్రీ దూరప్రయాణము చేసి వచ్చిన ప్రియుడింటికివచ్చుట తెలిసియు తెలియనట్లుగా నిద్ర నటించుచుండ నతడామె క్రిందిపెదవిని ప్రేమతో ముద్దుగొనటం.

అని చెప్పగానే ఆబాలిక బోర్డుంతోకూడ లోపలికిపోయినది. మరి అయిదునిమిషాల కోలావణ్యవతి ప్రత్యక్షమై ప్రకాశ్ చేతికో భరిణె యిచ్చింది. అది తెలివరుండానే అతడు తినవద్దన్నా సంపెంగ

వూగుత్తి నామెచేతికందిచ్చాడు. దాన్ని చూడటంతో ఆమె ముఖం తెల్లబారింది. ఆఖరిగౌమీద రాత్రి రెండవజాము దాటకుండా అని వుంది. భరిణతెరిస్తే తుమ్మెదవుంది. దాన్ని జేబులోపెట్టుకొని మళ్ళు ముఖంపట్టాడు.

మూడవబోర్డున్న గృహద్వారం సమీపించాడు. అక్కడొక చిత్రరువుంది. అదిప్రికాశ్‌నుచూచి నోరుతెఱచింది. వెంటనే అతడు దానినోటిలో కొంచెం నోటిలో తమలం ఊశాడు ఆమక్షణంలో పదు నాలుగేండ్ల పడుచువచ్చి చేయిబట్టుకొని సౌధము పైకి తీసికొనిపోయి బోర్డుకెదురుగా నిలబెట్టి వచ్చినవని కానియ్యంది. నువ్వుచదివితే నే నం జాయిషీ యిస్తానన్నాడు.

ఆపడుచు చిఱునవ్వుమొగంబున చిందులాడుచుండగా—

1 ప్రశ్న—చిత్తినీజాతిస్త్రీ లక్షణాలు గుర్తింపగలవా?

ఓహో! గుర్తింపగలను. వలుచని శరీరము, వటువైనమొగము, చలించు కన్నులు, తుమ్మెదకొదమలవంటి కురులు, సంపెంగవంటిముక్కు, బలిసినచన్నులు, భారమైనపిరుదులు, లావూ సన్నమూగాని నడుము, మల్లెమొగ్గలవంటి దంతములు కలిగి—చిత్రలేఖనమున నేర్పురాలై, తన మనస్సితరులకు చిక్కనీక, గానకళయందిష్టము కలదై ప్రౌఢరతిని కోరు నగది నుండును.

2—చిత్తినికి ముఖ్యకళాస్థానము లేమో?

చిత్తినికి ముఖ్యకళాస్థానములు—నుదురు, ముంగురులు, కన్నులు మరియు భద్రజాతి పురుషునివలవు.

3—నేటికై దవనాటి తిధియేమి? చిత్తినిలో నారేయి నేవేళ నెట్లుసంయోగిం పుమని కళాకోవిదులమతము?

నేటికై దవనాటితిధి9—ఆనాటిరేయి మూడవజాముస చిత్తినిని ముందధరామృతమునుపీల్చి, చన్నులను మెల్లగనంటుచు, బొడ్డుక్రింది భాగమును చేతితోనిమురుచు, గోళ్ళను మెల్లగ పుణుకుచు కౌగలించి సంయోగింపుమని కళాకోవిదులమతము.

4—బంధనములలో ప్రధానము లెవ్వి? జృంభిత మెట్లుండును?

బంధనలలో ప్రధానమ్ములై నవి ఉత్తానకరణములు, తిర్యక్కరణ ములు, స్థితకరణంబులు, ఉత్థితకరణంబులు, వ్యానకరణములు పురుష లకును—విపరీతకరణములు స్త్రీలందరికిని.

జృంభితము:— పురుషుడు స్త్రీకాళ్ళకు తనభుజములందుంచు కొని మెడచిక్కబట్టి తనకాలివ్రేళ్ళ నామెముఖమునకు పోనిచ్చి చేతుల తో చన్నులను బట్టుకొని పెదవికొరుకుచు రమించుట.

అనిచెప్పగనే ఆపడుచు బోర్డుచేతగొని లోనికేగినది. మరి ఐదు నిమిషములలో లోకోత్తర సౌందర్యవతియగు నొకయువతి సాక్షాత్క రించి ప్రకాశ్ గుప్పిటలో నొకఆకు ముడిచిపెట్టి నొక్కిపట్టినది. వెంటనే ప్రకాశ్ తనమూటలోని దానిమ్మవండు నామెచేత నుంచినాడు. ఆమె దానింగని నివ్వెఱపడినది. అతడాఆకునుజూడ దానిమ్మఆకుగానుండి మూడుభాగములుగా చీల్చబడినది. రాత్రి మూడవజామనిదానియర్థము. దాన్ని జేబులోపెట్టుకొని బిరబిరా మేడమెట్లుదిగి క్రిందికొచ్చాడు.

నాల్గవబోర్డున్న గృహకవాటం దగ్గరగా నొకకృత్రిమ సింహరూ పము గన్పట్టినది. ప్రకాశ్ దానినోట చేయిపెట్టి నాలుక పెఱుకబోగా

గంటమ్రోగినది. అంత 16 ఏండ్ల యువిద మందగమనంబునవచ్చి ప్రకాశ్ చేయిపట్టుకొని లోనికిగొంపోయి వివిధ మధురాహారంబులనిచ్చి హాయిగా వీవనతోవీచి—ఒక్కమారు తన గానసుధను గాత్రముతో మేళవించి తియ్యగా ఆలాపించింది- ప్రకాశ్ అశ్లేషిరచిత్తుడైయున్నాడు. బోర్డుకన బడుటలేదా? లేకేమి—నీనోటివెంట ఆప్రశ్నలు పలికిన తగు సమాధానములనిత్తునన్నాడు.

అంతనాయువిదబంగారుతీగెవంటి కంఠముతో మృదుమధురముగా

1 ప్రశ్న:— పద్మినీజాతిస్త్రీని కళావేత్తలెట్లు వర్ణించిరి?

పద్మినిజాతిస్త్రీని కళావేత్తలు—

పద్మినీజాతిస్త్రీ తామరమొగ్గవంటి మెత్తనిశరీరము, వికసించిన తామరపద్మపు వాసనవంటి రతిజలపువాసన, మాదీఫలములంబోలిన చన్నులు, నువ్వు పువ్వునుబోలినముక్కు, తామరపద్మమువంటి రహస్య స్థానము, అంచనడకవంటినడక, సన్నని నడుముకలిగి— మృదుమధురముగ మాటలాడునది, తెల్లచీరలందాసక్తి కలది, లఘుభోజనము, పతివ్రతా లక్షణములు కలదిగ నుండును.

2—పద్మినీకాంతకు ముఖ్యకళాస్థానములేమి?

పద్మినీకాంతను పాంచాలజాతి పురుషుడు రతికారంభమున కటి స్థలము, పిరుదులు, బొడ్డు తడిమి పిదప నున్నితముగు చూపుల తొడ లందును కటియందును బరవుట కళాస్థానములు.

3—నేటి కేడననాటి తిధియేమి? నాడంగనంగవయుటనుగూర్చి కళాశాస్త్ర విదులభావము లెట్లున్నవి? కూడిననెట్లప్పుడు సమంజసము?

నేటికేడవనాటితిధి 11—నాడు అంగనంగవయుట నమంజనము కాదని వాత్స్యాయనాదులును— తప్పులేదని కళాప్రియులును అభిప్రాయపడిరి. మొదట మెడమీద గోళ్ళతో నాలుగుక్షతములనుజేసి—బాగుగా కౌగలించి—అధరామృతమును చవిచూచి—ఎదరొమ్మునా నారొమ్మును కుమ్మచు రహస్యస్థానమందు అనామికతో (రెండవవ్రేలితో) రెండు మారులు త్రిప్పవలయును. వద్మినిని రాత్రి నాల్గవజామున గూడుట యుత్తమము.

4—బంధనములు చేయునపుడు స్త్రీ యెట్లుండవలెను— పురుషాయిత బంధలక్షణ మెట్టిది?

బంధనముచేయునపుడు స్త్రీవస్త్రమును విసర్జించి నగ్నముగా నుండవలెను. పురుషాయితము— స్త్రీపురుషునివలె రతిచేయుట— అనగా పురుషుడు రత్యంతమున నలసినపుడు స్త్రీకి తృప్తిలేక తానేపురుషునిపై బడి రతిచేసుకొనుట.

అని చెప్పుటతోడనే అయ్యువిదబోర్డునుబట్టుకొని లోనికేగినది. మరొకదునిమిషములకొరకు యచ్చరలేమవంటి జవ్వని— తెల్లనివసనములను— పుష్పములనుదాల్చి ప్రకాశ్ మెదుట ప్రత్యక్షమై నమస్కరించి నాల్గు మారులు రెప్పలల్లార్చినది. ఆమె నమస్కారమందుకొని కన్నులుమూసుకొని గిరుక్కున వెనుకకు మరలినాడు.

రిక్షామెక్కి బసకువచ్చినాడు. ఆయాసలువురబాలికలసౌందర్యమునుగూర్చి—లోపలికాంతల విలాసములనుగూర్చి తలపోస్తూ—తొందరగాలేచి భోజనము ముగించి కళాప్రియునివలె నలంకరించుకొని — కాలినడకతో ఏవేవో వస్తువులను బట్టించుకొని బోర్డులున్నవీధికేగినాడు.

తిరిగి సూర్యోదయమునకు ముందుగా నాల్గవబోర్డున్న యింటి నుండి బయలుదేరకుండగా నాలుగుబోర్డులు కట్టిన ఉవిదలును అక్కడ ప్రత్యక్షమై తమతమ కానుకలను గ్రహింపవలసినదని కోరారు.

ప్రకాశ్ ఆయువతివలవద్ద కానుకలను గైకొన్నాడు. అతడు టెన్నిస్‌ఛాంపియన్ అని వారికి తెలుసును. ఇంతలో అతన్ని వెదకుచు టెన్నిస్‌ఛాంపియన్ ఉన్నాడాఅని గాలిస్తూంటే ప్రకాశ్ బయటకొచ్చాడు. అతనివెంట ఆస్త్రీలునువచ్చి సాగనంపారు.

ఆవచ్చినవ్యక్తి ప్రకాశ్ ఒక టెన్నిస్‌ఛాంపియనే కాదు. ఇతడు రసికాగ్రేసరుడుకూడాను. ఇతణ్ని యిప్పటినుంచి లవ్‌ఛాంపియన్ అందాం-

అంటూవచ్చిన మిత్రుడూ—నానూ— బ్రాడ్వేబయలుదేరారు. తోవలో ప్రకాశ్ సంగతంతా చెప్పాడు.

'అరిపిడుగా' అన్నాడు.

---

౫

మఱునాడే పత్రికలో చూచినా ప్రకాశ్‌ను గురించిన పొగడ్తలే. వానిని చూశాడు రాజేశ్వరిఅన్న పత్రికల్లో. వెంటనే ప్రకాశ్ చిరునామా తెలియనందువల్ల—ఓ పత్రికావిలేఖరికి వినయపూర్వకంగా అతని చిరునామా తెలుపవలసిందని—అతను తనకి బావమరదని వ్రాసాడు.

ఆ పత్రికావిలేఖరి చాలా ప్రయాసపడి ప్రకాశ్‌ను కలుసుకొని యీసంగతి చెప్పాడు. ప్రకాశ్ రాజేశ్వరిని మరచిపోలేదు. పరిస్థితులు

చక్కబడందే యేమివ్రాయాలని యెప్పటికప్పుడే ఉపేక్షచేసాడు. రాజేశ్వరి యెప్పటికప్పుడు అన్నగారిని వేధించుకు తింటూనేవుంది. రాజేశ్వరి వదినగారు ఆమెదురవస్థకు జాలిపడి కన్నకూతురికంటె ఎక్కువగాఆమెను ఆదరిస్తోంది. ప్రకాశ్ ఆనాడుమెయిల్‌కి పోయేటట్టుగా బావగారికి పోల వరం ఓకవరువ్రాసాడు. అందులో—

శ్రీయుతులు బావగారికి

ప్రకాశ్ నమస్కారములు—

ఇక్కడకు నేనువచ్చి యిప్పటికి పదిమాసాలయినా యిచటిపరిస్థితులేమియు బాగులేనందున తమకేమియు వ్రాయజాలక ఒకఉత్తరమైనా వ్రాయలేదు. నేనిక్కడ క్షేమంగానే వున్నాను. చి॥ సౌ॥ రాజేశ్వరిని అనుక్షణము నాహృదయసీమలో దలంచుచు కూడ యిచటి పరిస్థితులామెకు తెలిసిన ఖేదపడునని వ్రాయలేదు. అందుకుమీరును, ఆమెయు నన్ను మన్నింపవలెను. మీ అందరిక్షేమమును తిరుగుటపాలో వ్రాయించవలెను. నేను పదిరోజులకి ముందటనే తేరుకున్నాను. ఇంటికిచేరుదామా అనుకుంటూండగానే మీరు పత్రికలవారికి వ్రాసినసంగతి నాకు వారివల్ల తెలిసింది.

ఇచ్చట నేను దైవవశమున నొక ఘనకార్యమాచరించ వలసినంత ధనముకూడబెట్టితిని. ఇచ్చటనుండియే యేదైన వ్యాపారము చేయ నిశ్చయించితిని. విషయములన్నియు సమ్ముఖమున మాటలాడుదును. ఈ ఉత్తరమందినవెంటనే తాము రాజేశ్వరిని, మాఅక్కగారిని, పిల్లలను తీసుకొని మదరాసురావలెను. మీరు వచ్చునుంచు టెలిగ్రాముస్తే స్టేషనుకు వస్తున్నాను. నాకేమివ్రాయుదలంచినా యీక్రిందచిరునామాఇచ్చాను.

'నా చిరునామా'

# M. P. RAO.

Tennis Champian & Love Champian.
132. RAJESWAREE PALACE, MAMBALAM,
**MADRAS.**

ప్రకాశ్ స్వీయబుద్ధిబలంబుచే లక్షరూపాయల వొక్క రాత్రిలో ఆర్జించడమే కాకుండా అనమానమైన కీర్తి నార్జించాడు. వినాయకరావు నొకనాడు కలుసుగోడానికెళ్ళాడు. అతనిపరిస్థితులేమీ మారలేదు. తన్ని ఆదిలో సకలసౌకర్యాలు చేకూర్చిగౌరవించి ఆదరించిన వినాయకరావుకు కృతజ్ఞత చూపాలని—అతనికి తిరిగీ మైండ్ సరిగావచ్చేటట్టు చెయ్యాలని విశ్వప్రయత్నంచేసాడు. ఇంతట్లోకే హఠాత్తుగా వినాయకరావుకు ఉపద్రవమైన జబ్బుచేసింది. ఆజబ్బులో కలిగిన చావు తెలివిసమయంలో—మనస్థిమితం చేకూరి ప్రకాశ్‌ను పిలిచి— తనఆస్తిలో సగము ప్రకాశ్‌కి తక్కినది ధర్మసంస్థలకి విల్లువ్రాయించి రిజష్టరీ చేయించాడు. మరినాలుగురోజుల్లో వినాయకరావు పరమపదముకు చేరాడు అతనిఆస్తిలో సగం ప్రకాశ్‌కి యివ్వడమే కాకుండా అతనుచేసే ఉద్యోగంకూడా ప్రకాశరావుకే వచ్చేటట్లుచేశాడు వినాయకరావు— ఇప్పుడు ప్రకాశ్ సివిల్ సప్లయిస్ డిపార్టుమెంటులో పెద్దఉద్యోగి.

రోజులు కలిసొస్తే అంతేగా !!!

వినాయకరావు మరణించిన రెండవరోజున ప్రకాశ్‌కి బావగారి దగ్గర్నుంచి టెలిగ్రామ్ వచ్చింది మెడ్రాసు వస్తున్నామని. అతడు కొత్తగా కొన్నకారులో— సెంట్రల్‌కు వెళ్ళి— రాజేశ్వరిని— బావగారిని— వారికుటుంబాన్ని వెంటబెట్టుకొని రాజేశ్వరీపేలస్‌కు వచ్చాడు. రాజేశ్వరి యావిచిత్ర విశాల సౌందర్య భవనానికి ముందుభాగమునం

దు గేటులో వ్రేలాడగట్టబడిన బోర్డులో తనపేరు చూసుకొని విశ్రాంతురాలయినది. ప్రకాశ్ బావగారు యిప్పటి అతనిపరిస్థితులన్నీ తెలుసుకొని మహదానందం పొందాడు.

ప్రకాశ్ రాజేశ్వరి— ఆనాటిరాత్రి తమస్వంతభవనంలో శయ్యాగారంలో ప్రవేశించారు. రాజేశ్వరి ఆనందానికి మేరలేదు. ప్రకాశామె గదిలో కెళ్ళడంతోటే ముందుగా— ఆమెను బుజ్జగించి ఆరాత్రితెల్లవారేవరకు తాను మెద్రాసు వచ్చినదగ్గరనుంచీ పడినకష్టాలూ—చేసిన పనులూ చెప్పాడు. ఆమె వానినన్నిటినివిని చిరునవ్వుతో భర్తపాదాలను ఆనందాశ్రువులతో కడిగింది. చిట్టచివర ప్రకాశ్ రాజేశ్వరిచెవిలో ...... చెప్పి యీవిషయంలో నీవు నన్ను మన్నించాలి—అని వేడుకున్నాడు చుబుకంపుణుకుతూ—

మీరలాఅనకూడదు —అని—రాజేశ్వరి తొలికోడికూతవేళ అతనికౌగిలిలో వాలింది—

రాజేశ్వరి అన్నగారు ప్రకాశ్ వైభవమంతాచూసి నివ్వెరపోయాడు. కాని ప్రకాశ్ కి యిదంతా ఏవిధంగా అబ్బిందో అడగాలని అతనికిలోవలుంది. అడగలేకపోతున్నాడు. ప్రకాశ్ కూడా ఉద్యోగంలో కొత్తగాచేరాడు కాబట్టి యేమీ తీరుబాటుండటంలేదు.

ఆవేళ ఆదివారం—ప్రకాశ్ ఉదయం 8 గంటలకు లేచి కాలకృత్యాలు తీర్చుకొని బాత్ రూములోకి పోయిస్నానంచేసి బయటకొచ్చాడు. రాజేశ్వరి భర్త నెదుర్కొని డ్రెస్సులు స్వయంగా తీసిచ్చి కాఫీకిరండి కిందకి—అన్నయ్య కనిపెట్టుకూర్చున్నాడనిచెప్పి క్రిందికెళ్ళిపోయింది. ప్రకాశ్ ఫుల్ షూటుతో క్రిందకొచ్చి బావగారిపక్కన కుర్చీలోకూర్చున్నాడు. కాఫీ ఫలహారాలు ముగిసాయి.

'ఎక్కడికోయి—ప్రయాణం'

'ఎక్కడికీలేదు—అలాషికారు పోయొద్దాం రండి'

'ఇప్పుడేంపికారు—ఇంట్లోనే కులాసాగా గడువుదాం'

'మధ్యాహ్నం వెడదాము—ఎగ్మూరులో ఒకయింటికెళ్ళాలి'

'జరువురా'

'అంతజరువురేంలేదుగాని అక్కడున్న మేడ అద్దెకివ్వాలి'

'అక్కడో మేడుందా?'

'ఔనండి. నన్నాదిలో మెడ్రాస్‌వచ్చినప్పుడు ఆదరించిన స్నేహితుడు చనిపోతూ ఆమేడ—కొంతఆస్తి నాపేరవ్రాశాడు.'

'ఎవరతను'

'అతనిపేరు వినాయకరావు. అతడు చనిపోతూ— నా కతడుచేసే ఉద్యోగం దొరికేటట్టు చేశాడు'

'చాలా ఉత్తముడు—కన్నతండ్రికంటె నయం'

'అయితే మానాన్న—నవలమ్మలజాడ లేమైనా మీకు తెలిసాయా?'

'మారాజేశ్వ రోనాడేదోమాటమీద—చెడ్డమాటోటి చెప్పింది'

'అవునులెండి—కర్మ'

'కర్మేమిటి—ఒళ్ళుపొగరు. అయినా మీతండ్రిగారల్లాటిపని చేయడమేమిటి?'

'అన్నిటికీ కర్మేనండి'

'కాదుగాని ముసలాయనేం చిక్కులువడుతున్నాడో?'

'మనం తెలుసుకోవాలండి—ఎలాతెలుస్తుంది'

'మీ వూరెళ్ళి వాకబుచేస్తే తెలియదా'

'తెలియకేం—తెలుస్తుంది—అయినా ఇవేళోస్నేహితుడికి వ్రాస్తా'

'మా రాజేశ్వరి అదే అంటుంది. ఆయన చాలమంచివాడు—మనస్సు విరగతీసేసింది—అంటుంది'

'అదియధార్థమే——లేకపోతే నన్ను మొదట్నుంచి అంత యిదిగా చూసినవాడు—ఆలా మారిపోవడమా'

'ఏదొచ్చినా మంచికే వస్తుంది'

'అలాగే అనుకుందాం'

'బావా! సంగతులేంచెప్పవు—కావు విశేషాలన్నీ చెవుతానన్నావు'

'చాలా తమాషాలెండి'

'ఆహా!—'

'ఆపరిస్థితులు చెపితే—మీరాశ్చర్యపోతారు. అందులో మనగొప్పేం లేదు, అంతా భగవంతుని విలాస'

అంటూ తాను మెడ్రాస్ వచ్చినదగ్గిరనుంచి జరిగినసంగతులన్నీ పూర్తిగ్రుచ్చినట్టు చెప్పాడు.

అంతలోనే భోజనానికి లేవండని రాజేశ్వరి తన అన్నగారూ—భర్తా వున్నగదిలోకివచ్చి చెప్పడంతో లేచి లోపలికెళ్ళి పోయారు భోజనానికి—

---

౬

ప్రకాశ్ ఆరోజున స్వంతకారులో తొందరగా ఆఫీసు వెడుతున్నాడు. కారు బ్రాడ్వేలో శరవేగంగా పోతూంది. ఆసమయంలో మాసినగడ్డము - నెరసినతల - లోపలకు నొక్కుకుపోయిన దవడలు చాలీచాలని మొలకిచుట్టుకొన్న గావంచాతో వున్నవ్యక్తి తూలిపోయి కారుక్రిందపడ్డాడు. వెంటనే ప్రకాశ్ కారాపి - డ్రైవర్ని మందలించి ఆవ్యక్తిని కారులోవేసుకొని అక్కడికి దగ్గరగావున్న జనరల్ ఆసుపత్రికి తీసుకెళ్ళి గాయాలకు కట్లుకట్టించి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

సాయంకాలం తిరిగి ఆఫీసునుంచివస్తూ - ఆసుపత్రిలోకెళ్ళి అతని పరిస్థితులు తెలుసుకున్నాడు. మరేమిభయంలేదు - బ్రతుకుతాడని డాక్ట

ర్లు అభయహస్తం యిచ్చారు. కాని ప్రకాశ్ కు ఆమనిషిని చూసిందగ్గర నుంచీ మనస్సులో ఏదో మోస్తరయింది. అయితే ఆవ్యక్తితో మాట్లాడి కనుక్కుందామంటే వీలులేకపోయింది.

మరినాలుగురోజుల అనంతరం — సాయంకాలం ఆఫీసునుంచిపోతూ ఆస్పత్రిలోకెళ్ళేసరికి ఆవ్యక్తి కొంచంకొంచంగా అచ్చటివారితో మాట లాడుతున్నాడు. అయితే మాటసవ్వడినిబట్టికూడా తెలుసుకోలేక పోయాడు.

ఆపేమంటే ప్రకాశ్ ముఖంకేసి నిదానంగా చూస్తున్నాడు. అంత లో ఓ నర్సువచ్చి నిన్నుఆసుపత్రిలోజేర్చి నీక్షేమసమాచారం కనుక్కుం టూన్నవారువీరే అనిచెప్పింది.

ఆవ్యక్తి చటాలున లేచి ప్రకాశ్ కాళ్లుపట్టుకోబోతూ కాలిమీద చిన్నప్పుడు కాలిపోయి మచ్చపడిన భాగాన్నిచూచి — లోపల సంశ యిస్తూ — తమపేరు మనవిచేస్తారా అన్నాడు.

'నాపేరు ప్రకాశరావు' మాది కాకినాడ — అనడంలోనే శర భయ్యగారు — నాయనా — నువ్వేనా? అని కాగలించు కున్నాడు. ప్రకాశరావుకి ఆవ్యక్తి ఎవరో అవుదర్థమైంది — నాన్నగారూ — అంటూ నమస్కారంచేసి హాస్పటలునుంచి రిలీవుచేయించి కారులో యింటికి తీసికెళ్లాడు. తండ్రి తనకుమారుని వైశ్వర్యమంతాచూచి ఆశ్చర్యపడి లోలోన సిగ్గుపడ్డాడు. ప్రకాశ్ యింట్లోకి వెళ్ళడంతోటే తండ్రి తన్ను జేరిన స్థితిగతులను భార్య రాజేశ్వరికి వివరించాడు. ఆమె తొందరగా వచ్చి మామగారికి నమస్కరించి — ఆదరించి — గౌరవించి — బ్రహ్మా నంద పడింది.

ప్రకాశ్ సాయంకాలందాకా ఓపికపట్టి సవతితల్లి సంగతి తండ్రిని నిరపాదిగా అడిగాడు—

ఆయన కన్నులవెంట నీళ్ళురాలుస్తూ — ఆమహాఇల్లాలి మాటలు నమ్మి — అదిచెప్పినట్లలాచేసి — కొడుకును — కోగలిని — వరాధవించాను — నన్నన్నివిధాలా అడవిపాలుచేసి వాళితో లేచి పోయింది. తిండికూడా చిక్కులుపడి నిన్ను వెతుక్కుంటూ మదరాసు చేరాను. నాజన్మ తరించింది. నిన్నుమళ్ళా కళ్ళతో చూశాను. ఇవాలని మాట ఎత్తద్దు—

అనిచెప్పి కొడుకూ కోడలూచేసే ఆదరణవల్ల మహాదానందం అనుభవిస్తున్నాడు.

---

౭

ప్రకాశ్—రాజేశ్వరి— రాజశ్వరిఅన్న—వదిన— వీరంతా మోరు మార్కెట్టులోకి ఖులాసాగా వచ్చారోనాడు అక్కడినుంచి విక్టోరియాపార్కు కెళ్ళారు. అలాఅలా వెళుతూండగా ప్రకాశ్ ఏవీధిలో నున్నబోర్డులుచూచి, కళాశాస్త్రములో పరీక్షయిచ్చి ఏస్త్రీలవల్ల లక్ష రూపాయిలు బహుమానమందాడో ఆవీధిలోకివచ్చింది కారు—

ప్రకాశ్ కారు నక్కడకు నడిపింపుమని రహస్యంగా డ్రైవరుతో చెప్పాడు. ఒక్కరాజేశ్వరి అన్నగారికే యది తెలుసును. కారా వీధిలో ఆపించి నడివీధిని ప్రకాశ్ నడుస్తుంటే ఆస్త్రీలు నలుగురు కనబడ్డారు.

వారు ప్రకాశ్ నిచూశారు. గుర్తుపట్టారు—అతనిని అభినందించాలని—స్వాగతమివ్వాలని — ఆలోచించి—ఒకబాలికను ఓచీటీయిచ్చి పంపారు—

అందులో—తమపునర్దర్శనంకాదనుకున్నాం—హఠాత్తుగా అయింది ఒక్కసారి లోపలకు దయచేసి—మా ఆతిథ్యం స్వీకరించండీ—మీ వెంటనున్నవారు కూడా రావచ్చును.

అని యున్నదిచదివి అందులో నలుగురిస్త్రీలసాతకాలు చూసి తప్పులేదని భావించి వెంటవచ్చిన వారందరితోను—లోపలికెళ్ళాడు—సింహద్వారం దాటిలోపలకు పోయేమేడమెట్లవద్ద బోర్డొకటి కట్టబడి వుంది—అందులోబోర్డు లెటర్సుతో—

# లవ్ ఛాంపియన్‌కు

## స్వాగతము

అని ఉండటంచూసికూడా ప్రకాశ్ బంధువర్గంతో లోపలికెళ్ళాడు. వారునల్వురువచ్చి నమస్కరించి—ఫలహారములను ఏర్పాటు చేసి—బాగాగౌరవించి—సంభాషిస్తున్నారు— ఆసమయంలో—ఆనాడు బోర్డులుచూపి ప్రశ్నలువేసి ప్రకాశ్‌చే సమాధానాలు చెప్పించిన 10, 12, 14, 16 ఏండ్లబాలికలు బాగుగాసింగారించుకొనివచ్చి—ప్రకాశ్‌కి వంగి నమస్కరించి—

My Dear LOVE CHAMPIAN

అని చప్పట్లు మోగి గలభా చేసారు.

హనుమాన్ ముద్రాక్షరశాల, రాజమండ్రి 1944

## రాబోవు నవలలు



## జంపనవారివి

| | |
|---|---|
| చైర్మన్ | 1 భా॥ |
| డిటో | 2 భా॥ |
| యక్సుచైర్మన్ | 1 భా॥ |
| డిటో | 2 భా॥ |
| కష్టజీవి | |
| కర్మ | |
| కాలమహిమ | |
| ప్రేమపూజ | |

వలయువారు:—

పి. వి. రామయ్యా సన్స్, రాజమండ్రి.

రాజహంస ప్రెస్, రాజమండ్రి.